శ్రీ

# SIVAGEETHA.

శ్రీమద్వేదవ్యాస మహామునీంద్ర విరచితాష్టాదశపురాణ
మాలికారత్న పద్మపురాణ స్థితంబును దర్శన స్పర్శన
పూజన పఠన శ్రవణాదులచేసకల కలికల్మష నివా
రకంబును శివమాహాత్మ్యప్రతిపాదకంబును

అనెడు

ఈ మోక్షగ్రంథము దీని యర్థంబెల్లరకుఁ దెల్లంబుగ
కరతలామలకంబు రీతిం దెలియునట్లు
నేలటూరు, వెంకటసుబ్బాశాస్త్రులవారిచే
జేయఁబడిన ఆంధ్ర తాత్పర్యంబుతోఁగూడ
పండితులచే బరిష్కరింపంబడి,

కె. వైయ్యాపురిశెట్టి కంపెనివారివలన
అల్బీనియన్ ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రకటింపఁబడియె.

చెన్నపట్టణము:
నెల తే 25 ది.

రిజస్టర్డు కాపీరైటు.

దీనివెల ౧౨ అణాలు. Price 12 Annas.

శ్రీ

# పీఠిక.

శ్రీమత్సమస్త కల్యాణ గుణగణ పరిపూర్ణుండగు, శ్రీరామ చంద్రుండు, పితృవాక్య పరిపాలనంబుజేయ నడవి కేగి దండ కావనంబందుండ నామహాత్ముని భార్యయైన సీతాదేవిని, రావణుం డపహరింప నాదేవుండు భార్యావియోగంబు సహింపంజాలక దుఃఖంపచుండ నాతనివద్దికి అగస్త్య మహా మునీంద్రుం డరుదెంచి శివమంత్రరాజం బుపదేశించె నిమ్మట నానరేంద్రుం డతిభక్తి నామంత్రంబును జపించుచుండ మహాదేవుండు ప్రీతుండై ప్రత్యక్షంబై పాశుపతాది దివ్యాస్త్రంబుల నిచ్చి, ఓరాజేంద్రా వీనిబలంబున రావణుని సబలంబుగా జయించి నీభార్యతోగూడి సకల సుఖంబుల బొందంగలవాడవని వరంబిచ్చినం బ్రీతుండై, శ్రీరామచంద్రుండో దేవదేవా శివతత్వం బెరుంగింపుమని ప్రార్థింప నాసదాశివుం డాతం డేది యేది యడిగినను, ఆ ప్రశ్నంబులకెల్ల నుత్తరంబు లిచ్చుచు నతిదయచే శివతత్వంబెల్ల నెరింగించె, నది శివగీతలని మహాప్రసిద్ధంబై పదునెనిమిది యధ్యాయంబులచే వెలయుచున్నది అట్టిమోక్ష గ్రంథార్థం బెల్లరకుం దెల్లంబుగా దెలియుటకై మేమాంధ్ర తాత్పర్యంబును, నే. వెంకట సుబ్బాశాస్త్రులవారిచే జేయించి, అచ్చువేయించి సకల సుజనులకు సులభక్రయముగ విక్రయించుచున్నాము.

మద్రాసు.
తా 20-ది జూలై నెల 1897.

ఇట్లు,
క. వై. శే. కం.

శ్రీరస్తు.

# శ్రీ శివ గీ తా ప్రా ర ం భః.

శ్రీసూతఉవాచ॥

శ్లో॥ అథాతస్సంప్రవక్ష్యామిశుద్ధం కైవల్యముక్తిదం। అనుగ్రహాన్మహేశస్యభవదుఃఖౌఘభేషజం॥ నకర్మణామనుష్ఠానైర్నదానైస్తపసాపివా। కైవల్యంలభతేమర్త్యః కింతుజ్ఞానేనకేవలం॥ ౧॥

## శి వ గీ తా ప్రా ర ం భ ము.

శ్రీ శౌనకాదిమహర్షులకు సూతుండు జెప్పుచున్నాడు.

తా॥ ఓ మునీంద్రులారా నే నీశ్వరానుగ్రహంబున పరిశుద్ధంబును సంసారదుఃఖ నివారకంబును కైవల్య ముక్తిప్రదంబైనదానిం జెప్పెదవినుండు సకలకర్మంబుల సర్వదానంబుల తపంబుల మనుజుండు ముక్తినొందంజాలడు జ్ఞానంబుచే ముక్తినొందు.

శ్లో॥ రామాయ దండకారణ్యే పార్వతీపతినాపురా। యాప్రోక్తాశివగీతాఖ్యాగుహ్యాద్గుహ్యతమాహి సా॥ యస్యాఃశ్రవణమాత్రేణనృణాంముక్తిర్ధ్రువాభవేత్ । పురాసనత్కుమారాయ స్కందేనాభిహితాహిసా ॥ సనత్కుమారః ప్రోవాచ వ్యాసాయఋషిసత్తమః।మహ్యాంకృపాతిరేకేణ ప్రదదౌబాదరాయణః॥ ౨॥

తా॥ శ్రీరామచంద్రుండు దండకావనంబుననుండ నీశ్వరుండామహాత్మునకుపదేశించినదియు పరమరహస్యంబైన శివగీతయనునొకటి కలదు దానివిన్నమాత్రంబుననే జనంబులకు ముక్తి దృఢంబుగాగలుగు దానిపూర్వంబున కుమారస్వామి సనత్కుమారునకుంజెప్పె నతండు వ్యాసునకెరుంగించె నామునిశ్రేష్ఠుండు నాకతిదయంజెప్పె.

శ్లో॥ ఉక్తంచ తేనకస్మైచి న్నదాతవ్యమిదంత్వయా। సూతపుత్రాన్యథా దేవాః క్షుభ్యంతిచశపంతిచ ॥ అథపృష్టో మయావిప్రాః భగవాన్బాదరాయణః। భగవన్దేవతాస్సర్వాః కింక్షుభ్యంతిశపంతివా ॥ తాసామత్రాస్తికాహాని ర్యయాకుప్యంతి దేవతాః। పారాశర్యో థమామాహయత్పృష్టంశృణువత్సతత్ ॥ ౮॥

తా॥ ఓశిష్యా దీని నెవ్వరికైన నెరింగింపకుము అట్లుగావించిన దేవతలు కోపంబున శపింతురని యాజ్ఞాపించె నంత నేనామహాత్మునితో నిట్లంటి. ఓ మునీంద్రా దేవతలేల శపింతురు దీనవారికేమి హానియగు నెరింగింపుమని వేడిన నాపారాశర్యుండిట్లని యానతిచ్చెను. ఓ సూతా నీవడిగిన ప్రశ్నంబునకు సమాధానంబు జెప్పెదవినుము.

శ్లో॥ నిత్యాగ్నిహోత్రిణోవిప్రాస్సంతి యేగృహమేధినః। త ఏవసర్వఫలదాస్సురాణాంకామధేనవః॥ భక్ష్యంభోజ్యం చపేయంచయద్యదిష్టం సుపర్వణాం। అగ్నౌహుతేనహవిషాతత్సర్వంలభ్యతేదివి ॥ నాన్యదస్తిసురేశానామిష్టసిద్ధిప్రదందివి। దోగ్ధ్రీధేనుర్యథానీతాదుఃఖదాగృహమేధినాం ॥ తథైవజ్ఞానవాన్విప్రో దేవానాం దుఃఖదోభవేత్। త్రిదశాస్తేనవిఘ్నంతిప్రవిష్టాహృదయేనృణాం॥౧౨॥

తా॥లోకంబున నిరంతరంబు జ్యోతిష్టోమాది యజ్ఞంబుల నగ్నిం బూజించుచు భక్ష్యభోజ్యాదు లేదేది దేవతలకిష్టంబో వానినెల్ల సమర్పించుచుండు బ్రాహ్మణోత్తములు దేవతలకు కామధేనువులతో సమానులై యుందురు. బ్రాహ్మణులేది యేది యగ్నియందు వ్రేల్తురో నవియెల్ల దేవతలకిష్టంబగుచుండు. పాడియిచ్చుచుండెడి యావును పరులపహరించిన నాగృహస్థున కెట్లుదుఃఖంబుగలుగునో యట్లజ్ఞానంబుచేతం గర్మపరిత్యాగియైన విప్రుండు దేవతలకు దుఃఖదాయియైయుండు నాకారణంబున నమరులాజ్ఞానుల మనంబులం బ్రవేశించి విఘ్నంబులం గావింపుచుందురు.

శ్లో॥ తతోనజాయతేభక్తిశ్శివేకస్యాపిదేహినః । తస్మాద్వివిధిషా నైవజాయతేశూలపాణినః॥ ౧౩॥

తా॥ కావున నెట్టివారికిని యీశ్వరభక్తిగల్గుట దుర్లభంబు మరియు నాదేవదేవుని నెరుంగంగోరుటయు నరుదైయుండు.

శ్లో॥ యథాకథంచిజ్జాతాపిమధ్యేవిచ్ఛిద్యతేనృణాం।జాతంవాపిశివజ్ఞానం నవిశ్వాసంభజత్యలం॥ ౧౪॥

తా॥ నరులకతిప్రయాసంబున శివభక్తిగల్గెనేనియు మధ్యకాలంబున విచ్ఛిన్నంబగు అట్లు కాకపోయెనేనియు దానియందు నమ్మకంబుండుట యరుదు.

ఋషయఊచుః॥

శ్లో॥ యద్యేవం దేవతావిఘ్నమాచరంతితనూభృతాం । పౌరుషం తత్రకస్యాస్తి తేనముక్తిర్నవీయసీ । సత్యంనూతాత్మజబ్రూహితత్రోపాయోస్తివానవా॥ ౧౫॥

తా॥ అని సూతుండెరుంగింపవిని శౌనకాదులిట్లనిరి. ఓమహాత్మా జనంబులజ్ఞానంబున కమరులు విఘ్నంబులాచరించుచుండిరేని యెట్లు నరులకు జ్ఞానంబుగల్గి ముక్తిలభించు. యోసూతనందనా దీనికిందగునుపాయంబు కలదాలేదా యెరుంగింపుమనిన సూతుండు జెప్పుచున్నాడు.

శ్రీసూతఉవాచ॥

శ్లో॥ కోటిజన్మార్జితైఃపుణ్యై శ్శివేభక్తిఃప్రజాయతే । ఇష్టాపూర్తానికర్మాణితేనాచరతిమానవః ॥ శివార్పణధియాకర్మపరిత్యజ్యయథావిధి । అనుగ్రహస్తేనశంభోర్జాయతేసుదృఢోనరే॥ ౧౬॥

తా॥ ఓమునీంద్రులారావినుండు నరుండుకోటిజన్మంబులం దానార్జించిన పుణ్యంబులచేశివభక్తిగలిగి యిష్టాపూర్తంబు లాదిగాగల కర్మంబులనాచరించి సకలకర్మంబుల శివార్పణంబుగాఁ బరిత్యజించెనేనివానికి యీశ్వరానుగ్రహంబు దృఢంబుగాగలుగు.

శ్లో॥ తతోభీతాఃపలాయంతేవిఘ్నంహిత్వాసురేశ్వరాః। జాయతేతేనశుశ్రూషాచరితేచంద్రమౌళినః ॥ శృణ్వతోజాయతేజ్ఞానంజ్ఞానాదేవవిముచ్యతే॥ ౧౯॥

తా॥ దానిచేనెల్లదేవతులును భయంబున విఘ్నంబులాచరింపరు అట్టివానికి యీశ్వరశుశ్రూషలభించి దానివలన ముక్తింబొందు.

శ్లో॥ బహునాత్రకిముక్తేనయస్యభక్తిశ్శివేదృఢా । మహోపాపోపపాపౌఘైరపిగ్రస్తోవిముచ్యతే॥ ౨౦॥

తా॥ ఓ మునీంద్రులారా వేయిమాటలంజెప్పనేల యేనరునికి శివభక్తి దృఢంబగునో యతండు మహాపాపంబుల నుపపాపపుంజంబుల జేసినవాడైనను ముక్తింబొందు.

శ్లో॥ అనాదరేణశాఠ్యేనపరిహాసైరసూయయా । శివభక్తిరతశ్చేత్స్యాదంత్యజోపివిముచ్యతె ॥ శివభక్తిశ్చసర్వేషాంసర్వదాసర్వతోముఖా । తస్యాంచలిప్యమానాయాం యస్తుమర్త్యోవిముచ్యతె । సంసారబంధనాత్తస్మాదన్యఃకోవాస్తిమూఢధీః॥ ౨౨॥

తా॥ ఆదరణలేకపోయినను మూర్ఖతంబుననైనను నవ్వులకైనను నసూయచేనైనను శివభక్తిగలనరుండు చండాలుండైనను ముక్తింబొందు. శివభక్తి సకలజనుల కతిసులభంబుగానుండ దానింగలిగి ముక్తింబొందఁజాలక నుండువాడు మూఢుండు.

శ్లో॥ నియమాద్యస్తుకుర్వీత భక్తింవాద్రోహమేవవా । తస్యాపిచేత్ప్రసన్నోసౌఫలంయచ్ఛతివాంఛితం ॥ ౨౩॥

తా॥ ఏనరుండైన నియమంబున శివభక్తింగాని శివద్రోహంబైనను చేసిననువానికిం బ్రీతుండై పరమేశ్వరుండు కోరినవరంబులనిచ్చు.

శ్లో॥ దళంకించిత్సమాదాయచులుకంజలమేవవా। యోదత్తే నియమేనాసౌతస్మైదత్తేజగత్త్రయం॥ ౨౪॥

తా॥ ఏనరుండైన స్వల్పదళంబైన చులుకమాత్ర జలంబైననుశివార్పణంబుజేయునో యతండు మూడులోకంబులనిచ్చువానికిందుల్యుండు,

శ్లో॥ తత్రాప్యశక్తోనియమాన్నమస్కారంప్రదక్షిణం। యఃకరోతిమహేశస్యతస్మైతుష్టోభవేచ్ఛివః॥ ౨౫॥

తా॥ అట్లుగావింపనశక్తుండగువాడు ప్రదక్షిణనమస్కారంబులంజేసిననుశివుండు ప్రీతుండగు.

శ్లో॥ ప్రదక్షిణాద్యశక్తోపి యఃస్వాంతేచింతయేచ్ఛివం। గచ్ఛన్నప్యుపవిష్టోవాతస్యాభీష్టం ప్రయచ్ఛతి ॥ చందనంబిల్వకాష్ఠస్యపుష్పాణివనజాన్యపి। ఫలానితాదృశాన్యేవయస్యప్రీతికరాణివై॥ దుష్కరంతస్యసేవాయాంకిమస్తిభువనత్రయే । వన్యేషుయాదృశీప్రీతిర్వర్తతేపరమేశితుః। ఉత్తమేష్వపినాస్త్యేవతాదృశీగ్రామజేషుతు॥ ౨౯॥

తా॥అట్లునుజేయ నసమర్థుండయ్యోనేని తనమనంబున నీశుంధ్యానించిననుముక్తిగలుగు. పరుండియైన ద్రోవనడుచుండియైన శివధ్యానంబు జేయందగు నాదేవదేవునకు బిల్వకాష్ఠచందనంబును వనజంబులైన పుష్పంబులు వన ఫలంబులు మొదలైనవి ప్రీతికరంబులుగావున నాదేవునిపూజింప త్రిలోకంబులను దుష్కరంబెద్దియులేదు. వనంబునంబుట్టిన పుష్పఫలాదులయందు నా దేవునికి ప్రీతిగలుగునట్లు పురగ్రామాదులంగల పుష్పఫలాదులయందులేదు.

శ్లో॥ తంత్యక్త్వాతాదృశందేవం యస్సేవేతాన్యదేవతాం। సహిభాగీరథీంత్యక్త్వాకాంక్షతేమృగతృష్ణికాం॥ కింతుయస్యాస్తిదురితంకోటిజన్మసుసంచితం । తస్యప్రకాశతేనాసావర్థోమోహాంధచేతసః॥ ౩౧॥

తా॥ అట్టిమహాదేవునిసేవించక యితరదేవతలసేవించువాడు గంగానదీజలంబులద్రావుటమాని యెండమావులజలంబులని ద్రావంగోరువానికిం దుల్యుండు, నరుండు పూర్వంబున ననేకజన్మంబుల పాపంబొనర్చియుండెనేని వాడీజన్మంబున మోహాంధుండై శివతత్త్వార్థంబెరుంగఁడు,

శ్లో॥ నకాలనియమోయత్ర నదేశస్యస్థలస్యచ । యత్రస్యచి
త్తంరమతేతత్రధ్యానేన కేవలం॥ స్వాత్మత్వేనశివస్యాసౌ
శివసాయుజ్యమాప్నుయాత్ ॥ ౩౨॥

తా॥ శివునిధ్యానింప కాలదేశవ్యవహారంబులు లేవు. నరుండు తనచిత్తంబునస్వాత్మత్వంబున ఈశునిధ్యానించుచున్న శివసాయుజ్యంబబ్బును.

శ్లో॥ అతిస్వల్పతరాయుశ్శ్రీర్భూతేశాంశాధిపోపియః । సతు
రాజాహమస్మీతివాదినంహంతిసాన్వయం॥ ౩౩॥

తా॥ భూతనాధుని యంశంబునంబుట్టి స్వల్పాయువైనవాడును నేరాజనని గర్వించిన వానినిర్మూలనంబుగా సంహరించును.

శ్లో॥ కర్తాపిసర్వలోకానా మక్షయైశ్వర్యవానపి । శివశ్శివో
హమస్మీతివాదినంయంచకంచన ॥ ఆత్మనా సహతాదా
త్మ్యభాగినంకురుతేభృశం॥ ౩౪॥

తా॥ సకలలోకంబుల కధికారియై సకలభోగంబులుగలవాడైనను శివజ్ఞానంబుగల యేనరునినైన తనకుసమానునిగాభావింపవలయు.

శ్లో॥ ధర్మార్థకామమోక్షాణాం పారంయాస్య ధయేనవై ।
మునయస్తత్ప్రవక్ష్యామి వ్రతంపాశుపతాభిధం ॥ కృ
త్వాతువిరజాదీక్షాంభూతిరుద్రాక్షధారిణః ॥ జపంతోవే
దసారాఖ్యంశివనామసహస్రకం ॥ సంత్యజ్యతేన మర్త్య
త్వం దైవీంతనుమవాప్స్యథ॥ ౩౫॥

తా॥ మనుజుండు ధర్మార్థకామమోక్షంబులపారంబెఱుంగ నుపాయంబెఱుంగించెద వినుండు పాశుపతవ్రతంబాచరించి విరజాదీక్షంగైకొని శరీరంబెల్ల భూతినలంది రుద్రాక్షమాలాధారులై వేదసారంబైన శివసహస్రనామంబుల జపించుచుండినేని మర్త్యత్వంబువాసి దైవత్వంబు నొందుగాన నోమునీంద్రులారా మీరలట్లొనర్చితిరేని.

శ్లో॥ తతఃప్రసన్నోభగవాన్ శంకరోలోకశంకరః । భవతాం
దృశ్యతామేత్య కైవల్యంవఃప్రదాస్యతి॥ ౩౬॥

తా॥ మీకుం బ్రసన్నుండై మహేశుండు ప్రత్యక్షంబై కైవల్యంబొసఁగు.

శ్లో॥ రామాయదండకారణ్యేయత్ప్రాదాత్కుంభసంభవః।
తత్సర్వంవఃప్రవక్ష్యామిశృణుధ్వంభ_క్తియోగినః ॥౩౯-౪॥

తా॥ పూర్వంబున శ్రీరామచంద్రుండు దండకావనంబునందుండ నగస్త్యమహామునీంద్రుం డాతనికుపదేశించినదాని మీకెరుంగించెద వినుండని శౌనకాదిమునీంద్రులకు సూతుండెరుంగించెను॥

ఇతి శ్రీపద్మపురాణే.

శ్రీమచ్ఛివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాంయోగశాస్త్రే సూతర్షిసంవాదే భ_క్తినిరూపణయోగోనామ ప్రథమోధ్యాయః॥

ఇది పద్మపురాణంబున శ్రీకరంబై యుపనిషద్రూపమైనదియు పరబ్రహ్మవిద్యయైనట్టి శివగీతలనెడు యోగశాస్త్రంబున సూతర్షిసంవాదరూపమైన భ_క్తినిరూపణంబను మొదటియధ్యాయము ముగిసెను.

## శివగీతాయాం ద్వితీయోధ్యాయః.

ఋషయ ఊచుః

శ్లో॥ కిమర్థమాగతోగస్త్యోరామచంద్రస్యసన్నిధిం । కథంవా విరజాదీక్షాం కారయామాసరాఘవం ॥ తతఃకిమాప్తవాన్రామఃఫలంతద్వక్తుమర్హసి ॥ ౧॥

శౌనకాదులు చెప్పుచున్నారు.

తా॥ ఓ సూతా అగస్త్యుండు శ్రీరామచంద్రుకడకేలవచ్చె నాతనిచే విరజాదీక్షనెట్లుజేయించె దానిచే రాఘవుండేమిఫలంబునొందె నెరింగింపుమని వేడిన సూతుండిట్లనియె.

శ్రీసూతఉవాచ.

శ్లో॥ రావణేనయదాసీతాపహృతాజనకాత్మజా। తదావియోగదుఃఖేనవిలపన్నాసరాఘవః ॥ నిర్నిద్రోనిరహంకారోనిరాహారోదివానిశం । మోక్తుమైచ్ఛత్తతఃప్రాణాన్ సానుజోరఘునందనః॥ ౩॥

తా॥ ఓ మునీంద్రులారా శ్రీరాముండు దండకాటవినుండ నాతనిభార్యయైనసీతాదేవిని రావణాసురుం డపహరించుకొనిపోవ నామహాత్ముండు భార్యావియోగంబు సహింపంజాలక విలపించుచు నిరాహారుండై నిద్రలేక లక్ష్మణుంగూడి తనప్రాణంబుల విడువంగోరుచుండ.

శ్లో॥ లోపాముద్రాపతిర్జ్ఞాత్వాతస్యసన్నిధిమాగమత్ । అథతంబోధయామాససంసారాసారతాంమునిః॥ ౪॥

తా॥ నావిధంబెరింగి యగస్త్యుండు రామునిసన్నిధింజేరి సంసారంబునిస్సారంబని యెఱింగించె నదియెట్లనిన.

అగస్త్యఉవాచ.

శ్లో॥ కింవిషీదసిరాజేంద్రకాంతాకస్యవిచార్యతాం । జడఃకింనుజానాతి దేహోయంపాంచభౌతికః ॥ నిర్లేపఃపరి

పూర్ణశ్చ సచ్చిదానందవిగ్రహః । ఆత్మానజాయతేనై
వ మ్రియతేనచదుఃఖభాక్ ॥ సూర్యోఽసౌ సర్వలోకస్య
చక్షుష్ట్వేనవ్యవస్థితః । తథాపిచాక్షుషైర్దోషైర్నక
దాచిద్విలిప్యతే ॥ సర్వభూతాంతరాత్మాపితద్వద్దుఃఖైర్న
లిప్యతే ॥ దేహోఽపిమలపిండోఽసౌ ముక్తజీవోజడా
త్మకః । దహ్యతేవహ్నినాకాష్ఠైశ్శివాద్యైర్భక్షితోఽపి
వా ॥ తథాపినైవజానాతివిరహేకస్యకావ్యథా । సువ
ర్ణగౌరీదూర్వాయాదళవచ్ఛ్యామలాపివా । పీనోత్తుం
గస్తనాభోగభుగ్నసూక్ష్మావలగ్నకా ॥ బృహన్నితంబజఘ
నారక్తపాదసరోరుహా । రాకాచంద్రముఖీబింబప్రతిబిం
బరదచ్ఛదా ॥ నీలేందీవరధిక్కారినయనద్వయశోభితా ।
మత్తకోకిలసల్లాపామత్తద్విరదగామినీ ॥ కటాక్షైరనుగృ
హ్ణాతి మాంపంచేషుశరోత్తమైః । ఇతియోమన్యతేమూ
ఢఃపంచేషుశరతాడితః ॥ ౧౩॥

అగస్త్యుండు చెప్పుచున్నాడు.

తా॥ ఓ నరేంద్రా నీవేలవిషాదంబునొందెదవు విచారింపుము భార్యయె
వనిదిమూఢుండెరుంగంజాలడీదేహంబు పాంచభౌతికంబైయుండు. పరిపూ
ర్ణుండు సచ్చిదానందవిగ్రహుండు నిర్లేపుండునైన పరమాత్మకు జనన
మరణాదులు సుఖదుఃఖంబులులేవు. సూర్యుండు సకలలోకంబులకు నేత్ర
ప్రాయుండైయుండియు నానేత్రదోషంబుల నొందం డట్లీయాత్మయు సర్వ
భూతాంతర్గతుండైయు దుఃఖంబుల నొందంజాలడు. మలపిండాత్మకంబై
జడంబైన యీదేహంబు ముక్తజీవంబై యగ్నిచేదహింపంబడునట్లుగాకున్న.
నక్కలు మొదలైనజంతువుచే భక్షింపంబడు నరుండీవిధంబెరుంగనేరక విర
హాదిదుఃఖంబులనొందుచుండుట నిరర్థకంబు మూఢుండు తనప్రియురాలిని
సువర్ణఛాయగలదనియు దూర్వాదళశ్యామలయనియు ఉత్తుంగస్తనయని
యు సూక్ష్మమధ్యయనియు గొప్పపిరుందులుగలదనియు యెఱ్ఱని పాదంబులు
గలదనియు చంద్రాస్యయనియు యిందీవరంబులం దిరస్కరించు నేత్రంబులు

గలదనియు మత్తకోకిలాలాపయనియు మదంపుటేనుంగువలె నడుచునదియని
యు కటాక్షవీక్షణంబుల దన్నుంగాంచుననియు మదనబాణమర్దితుండై దా
నిందలంచుచుండును॥

శ్లో॥ తస్యావివేకంవక్ష్యామిశృణుష్వావహితోనృప । నైవస్త్రీ
నపుమానేషో నైవచాయం నపుంసకః ॥ అమూర్తఃపు
రుషఃపూర్ణఃకథందేహీసదైవసః॥ యాతన్వంగీమృదు
స్బాలామలపిండాత్మికాజడా । సానపశ్యతియత్కించి
న్నశృణోతినజిఘ్రతి ॥ చర్మమాత్రంతనోస్తస్యాఃప్రోద్భి
ద్యేక్షస్వరాఘవ । యాప్రాణాదధికానైవహాంత తేస్యా
ద్ఘృణాస్పదం॥ జాయంతేయదిభూతేభ్యోదేహినఃపాం
చభౌతికాః । ఆత్మాయద్యమలస్తేషు పరిపూర్ణస్సనాత
నః॥ కాకాంతాత్రకఃకాంతః సర్వఏవసహోదరాః।
నిర్మితాయాంగృహావళ్యాం తదవచ్ఛిన్నతాంగతం ॥ న
భస్తస్యాంతుదగ్ధాయాంనకాంచిత్ క్షతిమృచ్ఛతి । తద్వ
దాత్మాపిదేహేషు పరిపూర్ణస్సనాతనః । హన్యమానేషు
సర్వేషుస్వయంనైవనిహన్యతే ॥ హంతాచేన్మన్యతేహం
తుంహతశ్చేన్మన్యతేహతం । తావుభౌనవిజానీతో నా
యంహంతినహన్యతే॥ తస్మాన్నృపాతిదుఃఖేనకింఖేదస్యా
స్తికారణం । స్వస్వరూపంవిదిత్వైవందుఃఖం త్యక్త్వా
సుఖీభవ ॥ ౨-౨॥

తా॥ అట్టివానియవివేకం బెఱింగించెద వినుము. పరమాత్మపురుషుండు
ను స్త్రీయును నపుంసకుండునుంగాడు ఆతండ మూర్తుండు పురాణుండు
పరిపూర్ణుండునై యుండుగాని దేహధారికాడు. తన్వంగియుమృదువు బాల
యు మలపిండాత్మయునైన స్త్రీచూడందగినదియు వినందగినదియు స్పృశింపఁ
దగినదియుంగాదు ఆస్త్రీని చర్మమాత్రంబు ఛేదించిచూడుము. ప్రాణంబు
లకన్న నధికంబుగానున్నదని భావింపవలదది దయకు బాత్రంబెట్లగు. పంచ
భూతంబులవలన దేహంబులుగలుగు వానిలో పరమాత్మ పరిపూర్ణుండు ని

ర్ణాలయందు సనాతనుండై వెలుంగు. శాంతయేది శాంతుండెవ్వండు సర్వం బు నేకరూపంబైయుండు. నిర్మింపంబడిన గృహంబుల నాశాశంబవచ్ఛిన్నంబైయుండియు, నాగృహంబులు దగ్ధంబులైన తానెడకుండు, నట్లీదేహంబులు నష్టంబులైనను పరమాత్మ జడకుండు. నేనొకనింజంపితినని వచించువాడును తానొకరిచే జంపంబడితియనువాడు నీయిర్వురు తత్వంబెరుఁగంజాలరు. పరమాత్మయొకరింజంపుటయు యొకరిచేఁజెడుటయునులేదు. కావున నేనిదుఃఖంబునొందనేల ఆత్మజ్ఞానంబుగలిగి సుఖంబునొందుము.

శ్రీరామఉవాచ.

శ్లో॥ మునేదేహస్యనోదుఃఖంనైవచేత్పరమాత్మనః।సీ
తావియోగదుఃఖాగ్నిర్మాంభస్మీకురుతేకథం॥ స
దానుభూయతేయోర్థస్సనాస్తీతిత్వయేరితం।జా
యతేతత్రవిశ్వాసఃకథంమేమునిపుంగవ ॥౨౮॥

అనిన రామచంద్రుండిట్లనియె.

తా॥ఓమునీంద్రా ఆత్మకుదుఃఖంబులేదు అయినను సీతావియోగంబునం బుట్టిన దుఃఖాగ్ని నాశరీరంబుదహించుచున్నది దీనికే నేమిజేయుదు.

శ్లో॥ అన్యోస్తివాత్రకోభోక్తాయేనజంతుఃప్రతప్యతే ।
సుఖస్యవాపిదుఃఖస్యతద్బ్రూహి మునిసత్తమ ॥ ౨౯॥

తా॥ సుఖదుఃఖంబులనుభవింప మరియొకండుకలండే నాకెరింగింపుము.

అగస్త్యఉవాచ.

శ్లో॥ దుర్జ్ఞేయాశాంభవీమాయాతయాసంమోహ్యతేజగ
త్ । మాయాంతుప్రకృతింవిద్ధిమాయినంతుమహేశ్వరం॥
తస్యావయవభూతైస్తువ్యాప్తంసర్వమిదంజగత్ । సత్య
జ్ఞానాత్మకోనంతోవిభురాత్మామహేశ్వరః ॥ తస్యైవాం
శోజీవలోకఃప్రాణినాంహృదయేస్థితః । విస్ఫులింగాయ
థావహ్నేర్జాయంతేకాష్ఠయోగతః ॥ అనాదికర్మసం

బంధా త్తద్వదంశా మహేశితుః। అనాదివాసనాయుక్తాః క్షేత్రజ్ఞా ఇతి తే స్మృతాః॥ మనోబుద్ధిరహంకారః చిత్తం చేతిచతుష్టయం । అంతఃకరణమిత్యాహుః తత్ర తే ప్రతిబింబితాః॥ జీవత్వం ప్రాప్నుయుః కర్మఫలం భోక్తార ఏవ తే। అతో వైషయికం తేషాం సుఖం వా దుఃఖమేవ వా ॥౩౧౫॥

అనిన మునీంద్రుం డిట్లనియె.

తా॥ ఓనృపా ఈశ్వరమాయ నెఱుంగ నేరికిందరంబుగాదు. ఆమాయను ప్రకృతింగాను శివునిమాయావంతుంగా నెఱుంగుము. ఆమాయారూపంబుల జగంబెల్ల మోహితంబగు సత్యజ్ఞానరూపుండును అనంతుండును విభుండునై యాత్మ వెలుంగు. నాదేవునియందు జీవకోటులెల్ల అగ్నియందు విస్ఫులింగంబులుంబోలె కర్మవాసనాయుక్తంబులై వెలుంగు. మనంబు బుద్ధియు నహంకారంబు చిత్తంబని నాలుగువిధంబులు. జీవులెల్ల పూర్వకర్మవశంబున సుఖదుఃఖంబు లనుభవింతురుగాన సుఖదుఃఖంబులు రెండును విషయంబులచేతంగల్గును.

శ్లో॥ తఏవభుంజతే భోగాన్యాతనేస్మిఞ్శరీరకే। స్థావరంజంగమం చేతి ద్వివిధం వపురుచ్యతే ॥ స్థావరా స్తత్ర దేహాస్స్యుర్వృక్షగుల్మలతాదయః। అండజాస్స్వేదజాస్స్న యుజోద్భిజ్జా ఇతి జంగమాః ॥ యోనిమన్యే ప్రపద్యంతే శరీరత్వాయ దేహినః । స్థాణుమన్యేనుసంయాంతి యథాకర్మ యథాశ్రుతం ॥ సుఖ్యహం దుఃఖ్యహం చేతి జీవఏవాభిమన్యతే । నిర్లేపోపి పరంజ్యోతి ర్మోహితశ్శంభుమాయయా॥ ౩౬౫

తా॥ ఆవిషయంబులభోగంబు లనుభవంబగు. స్థావరంబులనియు జంగమంబులనియు రెండువిధంబులు. స్థావరంబు వృక్షగుల్మలతాదులు జంగమంబులు దేహంబులు. అవి అండజంబులుద్భిజంబులు స్వేదజంబులుస్నాయుజంబులనినాలుగువిధంబులు. కొన్నియోనులంబుట్టు కొన్నిస్థాణురూపంబులు ఇవియెల్ల కర్మానుకూలంబులుగాగల్గు. నేసుఖిని నేదుఃఖంబుగలవాఁడనని జీవుండుదలంచునది శివమాయగానెఱుంగుము.

శ్లో॥ కామః క్రోధ స్తథాలోభో మదో మాత్సర్య మేవచ।
మోహ శ్చేత్యరిషడ్వర్గ మహంకారగతం విదుః॥
సఏవ బాధతే జీవం స్వప్న జాగ్రదవ స్తయోః। సు
షుప్తౌ తదభావాచ్చ జీవశ్శంకరతాంగతః॥ సఏవ
మాయాసంసృష్టః కారణం సుఖదుఃఖయోః।
శుక్తౌ రజతవద్విశ్వం దృశ్యతే మాయయాశివే॥ అ
తో వివేకీ జ్ఞానేన నకోప్యత్రాస్తి దుఃఖభాక్। అతః
పరమదుఃఖార్తః కిం మూఢపరితప్యసే॥ ३౯-౪ ॥

తా॥ కామంబు, క్రోధంబు, లోభంబు, మదంబు, మాత్సర్యంబు, మోహంబునని యఱిషడ్వర్గంబు బహంకారంబుతో గూడియుండు, అవియు జీవుని స్వప్న జాగ్రదవస్థల బాధించు, సుషుప్తియందు జీవుండు శంకరరూపంబు నొందు, ఆతండే మాయంగూడి సుఖదుఃఖంబులకు కారణుండగు. శుక్తియందు రజతంబురీతి మాయ చేవిశ్వంబెల్ల శివునియందు గనంబడు గాన, జ్ఞానంబునంజూడ దుఃఖంబనుభవించువాడెవ్వడులేడు, నీవేల మూఢుండవై దుఃఖించెదవు.

శ్రీరామఉవాచ.

శ్లో॥ మునే సర్వమిదం సత్యం యన్మదగ్రే త్వయేరితం। త
థాపినజహాత్యేతత్ప్రారబ్ధాదృష్టముల్బణం॥ ४०-౪॥

అనిన శ్రీరాముండిట్లనియె.

తా॥ ఓ మునీంద్రా నీవు చెప్పినదెల్ల నిజంబైనను ప్రారబ్ధకర్మంబు నన్ను బాధించుచున్నది.

శ్లో॥ మత్తం కుర్యాద్యథా మద్యం శుక్రవిద్యమపి ద్విజం।
తద్వత్ప్రారబ్ధదోషోపినజహాతి వివేకినం॥ అతః కిం
బహునోక్తేన ప్రారబ్ధం స శివం నరం। బాధతే
మాందివారాత్రి మహంకారోపితాదృశః। అ
త్యంతపీడితో జీవః స్థూలదేహం విముంచతి। తస్మా
చ్ఛివా ప్తయే మహ్యముపాయం కథయద్విజ॥ ४३॥

తా॥ పండితునినైన మద్యంబు మత్తుంగాఁజేయుచున్నది, అట్లనన్నీ ప్రా
రబ్ధ కర్మదోషంబు బాధించెడు వలుమాట లేల, నన్నీప్రారబ్ధంబే రాత్రింబగ
ళ్లు బాధించుచున్నది. అహంకారంబును యట్లనున్నది జీవుండు మిక్కి
బాధచేనలంది ప్రాణంబుల విడువంగోరియున్నవాడు, కాన నాకిప్పుడు శుభం
బుగల్గునుపాయంబెఱుంగింపుము అని శ్రీరాముం డగస్త్యుని వేడెను.

ఇతి శ్రీపద్మపురాణే.

శ్రీమచ్ఛివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే అగస్త్యరాఘవ సంవాదే వైరాగ్య
యోగోనామద్వితీయోఽధ్యాయః॥

తా॥ ఇదిపద్మపురాణంబున శ్రీకరంబై యుపనిషద్రూపమైనదియు పర
బ్రహ్మవిద్యయైనట్టి శివగీతలనెడు యోగశాస్త్రంబున అగస్త్యరాఘవసంవాద
రూపంబైన వైరాగ్యయోగంబను రెండవయధ్యాయము ముగిసెను.

## తృ తీ యో ధ్యా యః.

అగస్త్యఉవాచ.

శ్లో॥ నగృహ్ణాతివచఃపథ్యంకామక్రోధాదిపీడితః । హి
తంనరోచతేతస్యముమూర్షోరివభేషజం॥ ౧॥

అగస్త్యుండు చెప్పుచున్నాడు.

తా॥ ఓ రామచంద్రా నరుండు కామక్రోధాదిపీడితుండై పథ్యంబై
న వాక్కును వినండు వానికిహితంబు ముమూర్షునకు ఔషధంబునుంబోలె
రుచించదు.

శ్లో॥ మధ్యేసముద్రంయానీతా సీతాదైత్యేనమాయి
నా। ఆయాస్యతినృపశ్రేష్ఠసాకథంతవసన్నిధిం॥ ౨

తా॥ రావణుండు మాయచే సీతంగొనిపోయి సముద్రమధ్యంబున నుంచి
యున్నవాడు ఆసీత నీకెట్లులభించు.

శ్లో॥ బధ్యంతేదేవతాస్సర్వా ద్వారిమర్కటయూథవ
త్। కించచామరధారిణ్యో యస్యసంతిసురాంగ
నాః। ౩॥ భుక్తైత్రిలోకీమఖిలాం యశ్శంభువరద
ర్పితః । నిష్కంటకస్తస్యజయః కథంతవభవి
ష్యతి। ౪॥ ఇంద్రజిన్నామ పుత్రోయస్తస్యాస్తి
సమరోద్ధతః । కుంభకర్ణాభిధోభ్రాతాయస్యాస్తి
సురసూదనః ॥ ౫॥ అన్యోదివ్యాస్త్రసంయుక్త
శ్చిరంజీవీవిభీషణః । దుర్జయస్యాస్తిలంకా
ఖ్యందుర్గమందేవదానవైః । ౬ ॥ చతురంగబ
లంయస్య వర్తతేకోటిసంఖ్యయా । ఏకాకినా
త్వయాజేయః సకథం నృపనందన ॥ ౭ ॥ ఆ
కాంక్షతే కథంధర్తుం బాలశ్చంద్ర మసంయ
థా । తథాత్వం కామమోహేన జయంతస్యా
భివాంఛసి ॥ ౮॥

తా॥ ఆరావణునివాకిట సకలదేవతలును కోతులచందంబున బాధించఁబడుచున్నవారు, దేవతాంగనలెల్ల వానికి వింజామరలు వీచుచున్నవారు ఆతండు యీశ్వరవరదర్పితుండై త్రిలోకసుఖంబుల ననుభవించుచున్నవాడు, నీవాతనినిజయించుట దుర్ఘటంబు. వానికి యింద్రజిత్తను పుత్రుండుకల డాతండు అతిసమర్థుండు, మరియు కుంభకర్ణుండను తమ్ముండు కలండు, వాడు సురలకజేయుండు మరియు విభీషణుండను తమ్ముండొకండు కలడాతండు దివ్యాస్త్రవేదియు చిరంజీవియునైయుండు, వాడుండు లంకాపురంబు దేవాసురులు జొరరానిది వానికనేకకోటి సంఖ్యగల చతురంగబలంబులుఁగలవు. ఏకాకివగు నీవెటు వానిజయించెదవు. బాలుండు చంద్రుంబట్టుకొనఁగోరినట్లు కామమోహంబున నీవాదైత్యుని జయింపఁగోరియున్నవాడవు.

శ్రీరామ ఉవాచ.

శ్లో॥ క్షత్రియోహంమునిశ్రేష్ఠ భార్యామేరక్షసాహృతా । యదితంననిహన్మ్యాశు జీవనంమేస్తికింఫలం॥ ౧॥ అతస్తేతత్వబోధేన నమేకించిత్ప్రయోజనం । కామక్రోధాదయస్సర్వేదహంత్యేతేతనుంమమ॥ ౨॥ అహంకారోపి మేనిత్యంజీవనంహంతుముద్యతః । హృతాయాం నిజకాంతాయాం శత్రుణామమతస్యవా॥ ౩॥ యస్యతత్వబుభుత్సాస్యాత్సలోకేపురుషాధమః । తస్మాచ్ఛత్రువధోపాయం లంఘయిత్వాంబుధింరణే॥ ౪॥ బ్రూహిమేముని శార్దూల త్వత్తోనాన్యోస్తిమేగురుః॥ ౫॥

అనిన శ్రీరాముండిట్లనియె.

తా॥ ఓమునీంద్రా నేక్షత్రియుండ, నాభార్యను రావణుండపహరించె నే వానిఁజయింపకున్న నేబ్రతికియు ఫలంబేమికలదు, కాన నీవానతిచ్చినతత్వబోధంబెల్లనిరర్థకంబయ్యె. కామక్రోధాదులు అహంకారంబును నన్నుబాధించుచున్నవి, నాభార్య శత్రునిచే నపహరింపఁబడియుండ నాకేల తత్వబోధంబు నేపురుషాధముండ, ఓమునీంద్రా నే సముద్రంబుదాటి శత్రువుంజంపు నుపాయం బెరుఁగింపుము. నీకన్న నాకెవ్వండును గురుండులేడు.

అగస్త్య ఉవాచ.

ఏవంచేచ్ఛరణంయాహి పార్వతీపతిమవ్యయం
సచేత్ప్రసన్నోభగవాన్ వాంఛితార్థం ప్రదా
స్యతి॥౫॥ దేవైరజేయైశ్శక్రాద్యైర్హరిణాబ్ర
హ్మణాపివా । సతేవధ్యః కథంవాస్తు శంకరాను
గ్రహంవినా॥౬॥ అతస్త్వాం దీక్షయిష్యామి విర
జామార్గమాశ్రితః । తేనమార్గేణమర్త్యత్వం
హిత్వాతేజోమయోభవేః॥ ౭॥ యేనహత్వా
రణేశత్రూన్సర్వాన్కామానవాప్స్యతి॥ ౮॥

అనివేడిన నగస్త్యుండిట్లనియె.

తా॥ ఓరామచంద్రా అట్లయిన నీవిప్పుడు పార్వతీపతినిశరణంబునొందు
మాతండు ప్రసన్నుండయ్యెనేని నీకోరికలభించు. ఇంద్రాదిదేవతలచేతను హరి
హరులచేతను, అజేయుండగు రావణుని యాశ్వరానుగ్రహంబులేక నీవెట్లు
జయించెదవు, కావున నీచే విరజాదీక్ష చేయించెద, దానిచేనీవు మర్త్యత్వంబు
వాసి తేజోమయుండవై శత్రులజయించి సకలకామంబులంబొందెదవు.

శ్రీరామ ఉవాచ.

శ్లో॥ అథప్రణమ్యరామస్తందండవన్మునిసత్తమం । ఉ
వాచదుఃఖనిర్ముక్తః ప్రహృష్టేనాంతరాత్మనా॥
౯॥ కృతార్థోహంమునేజాతో వాంఛితార్థోమ
మాగతః । హితబుద్ధిః ప్రసన్నస్త్వంయదిమేకిం
సుదుష్కరం॥ ౧౦॥ అతస్త్వం విరజాదీక్షాం
బ్రూహిమేమునిసత్తమ॥ ౧౧॥

తా॥ అనిన శ్రీరాముండా మునీంద్రునకు దండప్రణామం బాచరించి
సకల దుఃఖంబులవిడిచి, సంతోషంబుచే ఓ మునీంద్రా, నేకృతార్థుండనైతి,
నాయభీష్టంబబ్బె, నీవు నాకు హితంబుగోరియుండ నాకేమి దుష్కరంబుగల
దు. కావున విరజాదీక్షాక్రమం బెరిగింపుమని శ్రీరాముండు వేడిన,

అగస్త్య ఉవాచ.

శ్లో॥ శుక్లపక్షేచతుర్దశ్యా । మష్టమ్యాంవావి శేషతః।
ఏకాదశ్యాం సోమవారె ఆర్ద్రాయాంచసమా
రభేత్॥ ౧౧॥ ధాతారమాహుర్యంరుద్రం శా
శ్వతంపరమేశ్వరం । పరాత్పరతరంచాహుః ప
రాత్పరతరంధ్రువం॥ ౧౨॥ బ్రహ్మణోజనకంవిష్ణో
ర్వహ్నేర్వాయోస్సదాశివం। ధ్యాత్వాగ్నినావ
సథ్యాగ్నింవిశోధ్యచపృథక్పృథక్॥ ౧౩॥ పంచ
భూతానిసంయమ్య మాత్రాగుణవిధిక్రమాత్।
మాత్రాపంచచతస్రశ్చ త్రిమాత్రాద్విస్తతః
పరం॥ ౧౪॥ ఏకమాత్రమమాత్రంవా ద్వాద
శాంతవ్యవస్థితః । స్థిత్యాంస్థాప్య మృతోభూ
త్వా వ్రతంపాశుపతంచరేత్॥ ౧౫॥

నగస్త్యమహామునీంద్రుం డిట్లనిరి.

తా॥ ఓరామచంద్రా, శుక్లపక్షంబున చతుర్థశినాడైన, అష్టమియందైన నేకాదశియందైనను, సోమవారంబున, ఆర్ద్రానక్షత్రంబందారంభించి, ధాతయు,రుద్రుండును, శాశ్వతుండును,పరాత్పరుండును, బ్రహ్మవిష్ణ్వాదులకు జనకుండునైన సదాశివుని ధ్యానించుచు, అగ్నిపూజంగావించి, పంచభూతంబుల నణాచి, శాస్త్రోక్తమార్గంబున పంచచతస్రత్రిద్వ్యేక మాత్రలచేనైన అమాత్రచేనైన ద్వాదశాంతస్థితుండై, అమృతరూపుండై పాశుపతవ్రతం బాచరింపవలయు.

శ్లో॥ ఇదంవ్రతం పాశుపతం వదిష్యామిసమాసతః ।
ప్రాతరేవంతుసంకల్ప్య విధాయాగ్నిం స్వశాఖ
యా॥ ౧౬॥ ఉపోషితశ్శుచిస్స్నాతః శుక్లాంబ
రధరస్స్వయం । శుక్లయజ్ఞోపవీతీచ శుక్లమా
ల్యానులేపనః॥౧౭॥ జుహుయాద్విరజామంత్రైః

ప్రాణాపానాదిభిస్తతః । అనువాకాంతమేకాగ్ర సమిదాజ్యచరూన్పృథక్॥ ౧౮॥ ఆత్మన్యగ్నిం సమారోప్య యాతేఅగ్నేతిమంత్రితః । భస్మాదాయాగ్నిరిత్యాద్యై ర్విమృజ్యాంగానిసంస్పృశేత్॥ ౧౯॥ భస్మఛన్నోద్విజోవిద్వాన్ మహాపాతకసంభవైః । పాపైర్విముచ్యతేసత్యం ముచ్యతేచనసంశయః॥ ౨౦॥

తా॥ ఆవ్రతక్రమంబెఱింగించెద,నరుండు ప్రాతఃకాలంబునసంకల్పంబు గావించి, స్వశాఖచే నగ్నింబూజించి ఉపోష్యంబుండి శుచియై, స్నానంబుఁజేసి, శుక్లవస్త్రంబునుగట్టి, శుక్లయజ్ఞోపవీతధారియై, శుక్లమాల్యంబులధరించి విరజామంత్రంబుల ప్రాణాపానాదుల హోమంబుచేసి, అనువాకాంతం బేకాగ్ర సమిదాజ్యచరువుల వేరువేరుగాఁజేసి, యాతేఅగ్నేయనుమంత్రంబుచే నగ్నిని ఆత్మారోపణంబుఁజేసి, భస్మాదాయాగ్ని రిత్యాదిమంత్రంబుల శరీరం బెల్ల స్పృశింపుచు భస్మంబలందికొనిన, మహాపాపంబులచే విముక్తుండగు. ఇది సత్యంబు యిందుకు సందియంబులేదు.

శ్లో॥ వీర్యమగ్నేర్యతోభస్మవీర్యవాన్ భస్మసంయుతః। భస్మస్నానరతోవిప్రోభస్మశాయీజితేంద్రియః ౨౧॥ సర్వపాపవినిర్ముక్తశ్శివసాయుజ్యమాప్నుయాత్॥ ౨౨॥

తా॥ భస్మంబగ్నివీర్యంబుగాన, దానిధరించినవా డధిక బలశాలియగు భస్మస్నానంబుజేయుచు, భస్మశాయియై, జితేంద్రియుండై, సకలపాపంబులంబాసి శివసాయుజ్యంబునొందు.

శ్లో॥ ఏవంకురుమహాభాగశివనామసహస్రకం । ఇదం తుభ్యంప్రదాస్యామి తేనసర్వార్థ మాప్స్యసి॥ ౨౩॥ ఇత్యుక్త్వాప్రదదౌతస్మై శివనామసహస్రకం । వేదసారాభిధం నిత్యం శివప్రత్యక్షకారక

కం ॥ ౨౮ ॥ ఉక్తంచ తేనరామత్వం జపన్నా
స్వదివానిశం । తతఃప్రసన్నో భగవాన్ మ
హాపాశుపతాస్త్రకం॥ ౨౯॥ తుభ్యందాస్యతి తే
నత్వం శత్రూన్హత్వాప్స్యసిప్రియాం । తస్యై
వాస్త్రస్యమాహాత్మ్యాత్సముద్రంశోషయిష్యసి॥
౩౦॥ సంహారకాదిజగతా మస్త్రంతత్పార్వతీ
పతేః । తదలాభేదానవానాం జయస్తేచసుదు
ర్లభః॥ ౩౧ ॥ తస్మాల్లబ్ధుంతదేవాస్త్రం శరణం
యాహిశంకరం॥ ౩౨॥

తా॥ ఓరామ నీవిట్లాచరింపుచు, శివసహస్రనామంబులనీకు నిచ్చెద, దా
నిచే సర్వార్థంబుల బొందెదవని మునీంద్రుండు వేదసారంబును, శివప్రత్యక్ష
దాయకంబునైన శివసహస్రనామంబుల శ్రీరామున కుపదేశించి, ఓరాజేంద్రా
యీమంత్రంబును రాత్రింబగళ్లు జపింపుచుండుము, దాన నీశుండు నీకుంబ్రీ
తుండై పాశుపతాస్త్రంబొసంగు దానిచే నీశత్రువులంజయించి, నీ ప్రియురా
లింబొందెదవు. నాయస్త్రమహాత్మ్యంబున నీవు సముద్రంబును శోషింపఁజే
సెదవు, నాయస్త్రంబుచే శివుండు జగత్సంహారంబుల జేయు నాయస్త్రంబు
లేకున్న నీకు రాక్షసులంజంపుట దుష్కరంబుగాన, నాయస్త్రంబునకై మ
హాదేవు శరణంబునొందుమని యగస్త్యుండు రామునకెఱుంగించెను.

ఇతి పద్మపురాణే,

శ్రీమచ్ఛివగీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే—అగస్త్యరాఘవసంవాదేవిరజాదీక్షాల
క్షణ యోగోనామ తృతీయోధ్యాయః.

ఇది శ్రీకరంబై యుపనిషద్రూపమైనదియు పరబ్రహ్మవిద్య
యైనట్టి శివగీతలనెడు యోగశాస్త్రంబున అగస్త్య
రాఘవ సంవాదంబున విరజాదీక్షాలక్షణంబను
మూడవ యధ్యాయము ముగిసెను.

## చ తు ర్థో ధ్యా యః.

శ్రీసూత ఉవాచ.

శ్లో॥ ఏవముక్త్వామునిశ్రేష్ఠే గతేతస్మిన్నిజాశ్రమం॥
అథరామగిరౌరామః పుణ్యేగోదావరీతటే ॥౧॥
శివలింగం ప్రతిష్ఠాప్య కృత్వాదీక్షాంయథావిధి।
భూతిభూషిత సర్వాంగో రుద్రాక్షా భరణైర్యు
తః॥౨॥అభిషిచ్యజలైః పుణ్యైర్గౌతమీసింధుసం
భవైః । అర్చయిత్వావన్యపుష్పైః స్తద్వద్వన్య
ఫలైరపి ॥౩॥ భస్మచ్ఛన్నో భస్మశాయీ వ్యా
ఘ్రచర్మాసనేస్థితః । నామ్నాంసహస్రం ప్రజప
న్నక్తందివమనన్యధీః॥ ౪॥

సూతుండు శౌనకాదులకుం జెప్పుచున్నాడు.

తా॥ ఓమునులారా ఇట్లు అగస్త్యుండు శ్రీరామునకుంజెప్పి నిజాశ్రమం బునకుంబోయె నంత రాముండు గోదావరీతటంబున రామగిరియందు శివలింగ ప్రతిష్ఠంజేసి విరజాదీక్షంబూని మేనెల్ల విభూతినలంది రుద్రాక్షలధరించి గౌతమీజలంబుల లింగాభిషేకంబు గావించి పుష్పంబులంబూజించి వన్యఫలంబులసమర్పించి భూతిఛన్నుండు భూతిశాయియునై వ్యాఘ్రాజినంబుపై గూర్చుండి రాత్రింబగళ్లు శివనామంబులఁజపించుచు,

శ్లో॥ మాసమేకంఫలాహారో మాసంపర్ణాశన స్తతః।
మాసమేకంజలాహారో మాసంచపవనాశనః॥౫॥
శాంతో దాంతః ప్రసన్నాత్మా ధ్యాయన్నేవమ
హేశ్వరం। హృత్పంకజేసమాసీన ముమాదేహా
ర్ధధారిణం ॥౬॥ చతుర్భుజంత్రిణయనం విద్యు
త్పింగజటాధరం। కోటిసూర్యప్రతీకాశం చంద్ర
కోటి సుశీతలం ॥ ౭ ॥ సర్వాభరణసంయుక్తం

నాగయజ్ఞోపవీతినం। వ్యాఘ్రచర్మాంబరధరం వ
రదాభయధారిణం ॥ ౮ ॥ వ్యాఘ్రచర్మోత్తరీ
యంచ సురాసురనమస్కృతం । పంచవక్త్రం
చంద్రమౌళింత్రిశూలడమరూధరం ॥ ౯ ॥ నిత్యం
చశాశ్వతంశుద్ధం ధ్రువమక్షరమవ్యయం ॥౯॥ ఏ
వంనిత్యంప్రజపతో గతంమాసచతుష్టయం॥౧౦॥

తా॥ ఒకమాసకాలంబు ఫలంబులభుజించి యొకమాసంబు పర్ణం
బులనమలి యొకమాసంబు జలంబులంద్రావి యొకమాసం బుపవాసనుండనై
శాంతుండు దాంతుండు ప్రసన్నహృదయుండునై మనంబున నీశుందలం
చుచు హృత్పద్మనివాసియు పార్వతీశరీరార్ధధారియు చతుర్భుజుండు త్రి
నేత్రుండును కోటిసూర్యప్రకాశుండును కోటిచంద్రశీతలుండును సర్వాభ
రణ సమేతుండును నాగయజ్ఞోపవీతధారియు వ్యాఘ్రచర్మాంబరుండును వర
దాభయధారియు దేవాసుర నమస్కృతుండును పంచముఖుండును చంద్రమౌ
ళియు త్రిశూల డమరుకధారియు నిత్యుండు శాశ్వతుండు శుద్ధుండక్షరుండు
అవ్యయుండునైన సదాశివుంజపించుచు నాలుగునెలలుండె.

శ్లో॥ అథజాతోమహానాదో ప్రళయాంబుదభీషణః।
సముద్రమథనోద్భూత మందరావనిభృధ్వనిః॥
౧౧॥ రుద్రబాణాగ్నిసందీప్త భస్యత్త్రిపురవి
భ్రమః। తమాకర్ణ్యాతిసంభ్రాంతో యావత్ప
శ్యతిపుష్కరం॥ ౧౨॥ తావదేవమహాతేజోరా
మస్యాసీత్పురోద్విజాః। తేజసా తేనసంభ్రాంత
స్సోపశ్యద్ధనుస్స్వకం॥ ౧౩ ॥ అభిద్యన్నిశితై
ర్బాణై ర్దివ్యాస్త్రైరభిమంత్రితైః । అగ్నే
యంవారుణంసౌమ్యం మోహనం సౌరపార్వ
తం॥ ౧౪ ॥ అంధీకృతేక్షణస్త్వూర్ణం మోహం
యాతోన్నృపాత్మజః । విచింత్యతర్కయామాస

దైత్యమాయాంద్విజేశ్వరాః॥ ౧౪॥ అథోద్ధాయ
మహావీర్యః సజ్యంకృత్వాధనుస్స్వకం। అభిద్య
న్నిశితైర్బాణైర్దివ్యాస్త్రైరభిమంత్రితైః ॥౧౬॥

తా॥ నంత ప్రళయకాలమేఘంబునుంబోలె భయంకరంబును సముద్ర మథనంబున మందరధ్వానంబునుంబోలె వెలుంగునదియు త్రిపురమర్దనకాలంబున రుద్రాగ్నియుంబోలె భయంకరంబైన మహాధ్వని రామచంద్రునెదుటవొడమిన దానివిని రాముండుసంభ్రాంతుండైయుండ యొకమహాతేజం బాతనిపురోభాగంబున దేదీప్యమానంబై వెలుంగ దానింగాంచి రాముండాగ్రహంబున ధనుర్ధారియై దివ్యాస్త్రంబు లభిమంత్రించి తీక్ష్ణబాణంబులం బ్రయోగించి ఆగ్నేయ వారుణ సౌమ్య మోహనసౌరాది దివ్యాస్త్రంబులనేసి యాతేజంబుచే తననేత్రంబులదర నంధీకృతనయనుండై మోహంబునొంది యిది దైత్యమాయ గాంబోలునని మరలధనుస్సునుసజ్యంబుగావించి నిశితబాణంబుల దివ్యాస్త్రంబులభిమంత్రించి,

శ్లో॥ ఆగ్నేయంవారుణంసౌమ్యం మోహనం సౌర
పార్వతం । విష్ణుచక్రం మహాచక్రం కాలచక్రం
చవైష్ణవం॥ ౧౭॥ రౌద్రంపాశుపతంబ్రాహ్మం కౌ
బేరంకులిశానలం । భార్గవాది బహూన్యస్త్రా
ణ్యేవంప్రాయు ఙ్క్తరాఘవః॥　　　౧౮॥

తా॥ విష్ణుచక్రంబును మహాచక్రంబును కాలచక్రంబు రౌద్రంబువైష్ణవంబు పాశుపతంబు బ్రాహ్మంబు కౌబేరంబు కులిశంబు భార్గవంబు మొదలైన ననేకాస్త్రంబులం బ్రయోగింప,

శ్లో॥ తస్మిం స్తేజసిశస్త్రాణి చాస్త్రాణ్యస్యమహీపతేః॥
విలీనానిమహాభ్రస్యకరకాఇవనీరధౌ॥　　　౧౯॥

తా॥ నవియెల్ల నామహాతేజంబందుసముద్రంబునఁబడిన వడగండ్లుంబోలె లీనంబులైయడంగెను.

శ్లో॥ అథక్షణేనజజ్వాల ధనుస్తస్యకరాచ్చ్యుతం। తూ
ణీరంచాంగుళిత్రాణం గోధికాపిమహీపతేః॥౨౦

తందృష్ట్వాలక్ష్మణో భీతః పపాతభువి మూర్ఛితః॥ అథకుంచత్కరోరామో జానుభ్యామవనీంగతః॥ ౨౧॥ మీలితాక్షోభయావిష్ట శ్శంకరంశరణంగ తః । స్వరేణాప్యుచ్చరన్నుచ్చై శ్శంభోర్నామసహస్రకం॥౨౨॥ శివంచదండవద్భూమౌ ప్రణనామపునఃపునః । పునశ్చ పూర్వవచ్చాసీచ్ఛబ్దోబ్రహ్మాండలంగ్రసన్ ॥ ౨౩॥ చచాలవసుధాఘోరంపర్వతాశ్చచకంపిరె। అథక్షణేనశీతాంశు శీతలంతేజఆసతత్ ॥ ౨౪ ॥ ఉన్మీలితాక్షోరామస్తుయావద్వ్యోమప్రపశ్యతి। తావద్దదర్శ వృషభం సర్వాలంకారసంయుతం ॥ ౨౫ ॥ పీయూషమథనోద్భూత నవనీతస్యపిండవత్ । స్వర్ణవాలంమరకత ఛాయాశృంగ ద్వయాంచితం ॥ ౨౬ ॥ నీలరత్నేక్షణంహ్రస్వ కంఠకంబళభూషితం । రత్నపల్యాణసంయుక్తం నిబద్ధం శ్వేతచామరైః ॥ ౨౭ ॥ ఘంటికాఘు ర్ఘురీశబ్దైః పూరయంతందిశోదశ ॥ తత్రాసీనంమహాదేవం శుద్ధస్ఫటికవిగ్రహం॥ ౨౮ ॥ కోటిసూర్యప్రతీకాశం కోటిశీతాంశుశీతలం ॥ వ్యాఘ్రచర్మాంబరధరం నాగయజ్ఞోప వీతినం ॥ ౨౯ ॥ సర్వాభరణసంయుక్తం విద్యుత్పింగజటాధరం॥ ౨౯॥ నీలకంఠంవ్యాఘ్రచర్మోత్తరీయం చంద్రశేఖరం॥ ౩౦॥ నానావిధాయుధోద్భాసి దశబాహుం త్రిలోచనం। యువానంపురుషశ్రేష్ఠం సచ్చిదానంద విగ్రహం॥ ౩౧॥

తే॥ పిమ్మట క్షణంబునకు ఆరాముని చేతి విల్లుజారి నేలంబడి భస్మంబయ్యె. పిమ్మట తూణీరంబులు అంగుళిత్రాణంబును గోధికయు భస్మంబయ్యె. దానింగాంచి లక్ష్మణుండు భయంబున మూర్ఛితుండై నేలంబడియె. పిమ్మట రాముండును హాకాళ్లనూదుచు యవనింద్రెల్ల శంకరుశరణంబుజొచ్చి శివనామపారాయణంబు నుచ్చైఃస్వరంబుగాజేయుచు నీశుంగూర్చి మరలమరల దండప్రణామంబు లాచరించుచుండ మరల ముందువలె మహాధ్వని బ్రహ్మాండంబగలించుచుం బరగె నంత భూమికంపించె బర్వతంబులువడంకె బిమ్మట నొకక్షణమాత్రంబునకు చంద్రశీతలంబైన మహాతేజంబు వొడమె నంత రాముండు కనులమూసికొని కొంతకాలంబుండి మరల నేత్రంబులదెరచి సర్వాలంకారంబులుగలిగి, క్షీరంబుద్రచ్చిన గల్గు నవనీత పిండంబునుంబోలె వెలుంగుచు స్వర్ణవాలంబుగల్గి మరకతశృంగంబులచే వెలసి మహానీలమణుల కాంతిగల కన్నులుగల్గి కంఠంబున రత్నకంబళిగలిగి రత్నంపు పగ్గంబుచే వెలసి శ్వేతచామరనిబద్ధంబై ఘంటలశబ్దంబు దశదిక్కుల పూరించుచున్నయొక వృషభంబుగాంచి దానిపైగూర్చుండి శుద్ధస్ఫటిక విగ్రహుండై కోటిసూర్యకాంతిచే వెలుంగుచు కోటిచంద్రులుంబోలె యతిశీతలుండై పులిచర్మంబుధరించి నాగయజ్ఞోపవీతియై సర్వాభరణ భూషితుండై మెరుగులంబోలు జడలందాల్చి, నీలకంఠుండై వ్యాఘ్రచర్మంబుత్తరీయంబుగా ధరించి చంద్రశేఖరుండై నానావిధాయుధ శోభితంబులైన పదిభుజంబులుగల్గి త్రిలోచనుండై పురుషశ్రేష్ఠుండై యౌవనంబుగలిగి సచ్చిదానంద విగ్రహుండై వెలుంగు మహేశుంగాంచి.

శ్లో॥ తత్రైవచసుఖాసీనాం పూర్ణచంద్రనిభాననాం ।
నీలేందీవరదామాభా ముద్యన్మరకతప్రభాం ॥
౩౨॥ ముక్తాభరణసంయుక్తాం రాత్రింతారాం
చితామివ। వింధ్యక్షితిధరోత్తుంగ స్తనభారభ
రాలసాం॥ ౩౩॥ సదసత్సంశయావిష్ట మధ్యదే
శాంతలోదరీం। దివ్యాభరణసంయుక్తాం దివ్య
గంధానులేపనాం॥ ౩౪॥ దివ్యమాల్యాంబరధ
రాం స్మేరేందీవరలోచనాం। అలకోద్భాసివద
నాం। తాంబూలగ్రాసశోభితాం॥ ౩౫॥ శివా

లింగనసంజాత పులకోద్భాసివిగ్రహాం| సచ్చిదా
నందరూపాఢ్యాం జగన్మాతరమంబికాం॥ ౩౬॥
సౌందర్యసారసందోహాం దదర్శరఘునందనః॥
౩౬½॥ స్వస్వవాహనసంబంధాన్ నానాయుధల
సత్కరాన్॥ ౩౭॥ బృహద్రథంతరాదీని నామా
నిపరిగాయతః॥ ౩౭½॥

తా॥ యాతని వెంబడి వృషభంబుమీదం గూర్చుండి పూర్ణచంద్రుం బోలు ముఖంబుగల్గి నల్లకలువలవంటి దేహకాంతిచేనొప్పి మరకతమణిప్రభాభాసురయైముక్తాభరణంబులఁదాల్చి తారలంగూడిన రాత్రింబోలె వెలుంగుచు పర్వతోత్తుంగ స్తనభారయై కలదులేదను సంశయాత్మకంబైన మధ్యంబుగలిగి తలోదరియు దివ్యాభరణభూషితయునై దివ్య మాల్యంబులందాల్చి ఇందీవరలోచనంబులుగల్గి అలకంబులచే ప్రకాశించు ముఖంబుగల్గి తాంబూలంబు చేయుచు శివాలింగనంబుచే మేనెల్లపులకలువొడమ సచ్చిదానంద రూపయై జగన్మాతయు అంబికయు సౌందర్యసారభూతయునైయుండు పార్వతింగాంచి మరియు శ్రీరామచంద్రుండు వారివారి వాహనంబులనెక్కి నానాయుధధారులై బృహద్రథంతరాదినామంబులబఠించుచు.

శ్లో॥ స్వస్వకాంతా సమాయుక్తాన్ దిక్పాలాన్ పరి
తఃస్థితాన్॥ ౩౮॥ అగ్రతోగరుడారూఢంశంఖచ
క్రగదాధరం । కాలాంబుదప్రతీకాశం విద్యు
త్కాంత్యాశ్రియాయుతం॥ ౩౮॥ జపంతమేకమ
నసా రుద్రాధ్యాయంజనార్దనం॥ ౩౯½॥

తా॥ తమతమ భార్యలంగూడిన దిక్పాలురను వారిముందు గరుడారూఢుండై శంఖచక్ర గదాధారియై కాలాంబుద సన్నిభుండై మెరుంగులకాంతిగల లక్ష్మీదేవింగూడి రుద్రాధ్యాయంబేకచిత్తుండై జపించుచున్న విష్ణుదేవుని.

శ్లో॥ పశ్చాచ్చతుర్ముఖందేవం బ్రహ్మాణంహంసవా
హనం॥౪౦ ॥ చతుర్వక్త్రైశ్చతుర్వేదైః రాద్రై

సూ_క్తైర్మహేశ్వరం । స్తువంతంభారతీయుక్తం
దీర్ఘకూర్చజటాధరం॥ ౪౧॥

తా॥ హంసవాహనుండై నాలుగు మొగంబులుగల్గి భారతీసమేతుండై రౌద్రసూక్తంబుల శివుని ధ్యానించుచున్న బ్రహ్మను.

శ్లో॥ అథర్వశిరసా దేవం స్తువంతంమునిమండలం।గం
గాదితటినీయుక్త మంబుధింనీలవిగ్రహం ॥ ౪౨॥
శ్వేతాశ్వతరమంత్రేణ స్తువంతంగిరిజాపతిం। అ
నంతాదిమహానాగాన్ కైలాసగిరిసన్నిభాన్ ॥
౪౩ ॥ కైవల్యోపనిషత్పాఠ రతాన్మణివిభూ
షితాన్। సువర్ణవేత్రహస్తాఢ్యం నందీశంపురతః
స్థితం॥౪౪॥ దక్షిణేమూషకారూఢం గణేశంపర్వ
తోపమం। మయూరవాహనారూఢ ముత్తరేష
ణ్ముఖంతథా॥౪౫॥ మహాకాళంచచండీశంపార్శ్వ
యోర్భీషణాకృతిం। కాలాగ్నిరుద్రం దూరస్థం
జ్వలత్కాలాగ్నిసన్నిభం॥ ౪౬॥ త్రిపాదంకుత్సి
తాకారం నటద్భృంగిరిటంపురః। నానావికార
వదనాన్ కోటిశఃప్రమథాధిపాన్॥౪౭ ॥ నానా
వాహనసంయుక్తం పరితోమాతృమండలం।పం
చాక్షరీజపాయుక్తాన్ సిద్ధవిద్యాధరాదికాన్॥

తా॥ అథర్వమంత్రంబుల దేవదేవుని స్తుతించుచున్నమునులను గంగాది నదులతోగూడి నీలవిగ్రహుండై శ్వేతాశ్వతరమంత్రంబులసదాశివునిస్తోత్రం బుజేయుచున్నసముద్రుని కైలాసపర్వతంబునుంబోలె శరీరంబులుదాల్చి కైవల్యోపనిషత్తుచే నీశుం ధ్యానించుచు మణిభూషితులై యున్న శేషాది మహానాగంబులను ముందు సువర్ణవేత్రధారియైయున్న నందీశుని దక్షిణంబున మూషకంబుపై నెక్కియున్న గణేశుని మయూరవాహనారూఢుండై

యుత్తరంబందున్న కుమారస్వామిని యుభయపార్శ్వంబులనున్న మహాకాళ చండీశులను దూరంబందున్న కాలాగ్నిరుద్రుని మూడు పాదంబులుగల్గి కుక్షి తాకారుండై. పురోభాగంబున నాట్యంబు జేయుచున్న భృంగిరిటిని నానా వికార వదనంబులుగలిగియున్న ప్రమథకోటులను నానావాహనంబుల నెక్కియున్న మాతృమండలంబును పంచాక్షరీ జపంబు గావించుచున్న సిద్ధ విద్యాధరాదులను.

శ్లో॥ దివ్యమందరగీతాని గాయత్కిన్నర బృందకం।
తత్రత్రియంబకంమంత్రం జపద్ద్విజకదంబకం॥
౪౯॥ గాయంతంవీణయాగీతం నృత్యంతంనార
దందివి। నృత్యతోలాస్యనృత్తేన రంభాదీనప్సరో
గణాన్॥ ౫౦॥

తా॥ దివ్యగీతంబులం బాడుచున్న కిన్నరులను త్ర్యంబకమంత్రంబు జ పించుచున్న ద్విజులను ఆకాశంబున వీణాగానంబుజేయు నారదుని లాస్య నృత్తంబుజేయురంభాద్యప్సరసలను.

శ్లో॥ గాయచ్చిత్రరథాదీనాం గంధర్వాణాం కదంబ
కం। కంబళాశ్వతరౌశంభోః కర్ణకుండలతాంగ
తౌ॥ ౫౧॥ గాయంతౌపన్నగాగీతం కపాలంకం
బళంతథా। ఏవందేవసభాందృష్ట్వా కృతార్థోర
ఘునందనః॥౫౨॥ హర్షగద్గదయావాచాస్తువన్
దేవంమహేశ్వరం। దివ్యనామసహస్రేణ ప్రణ
నామపునఃపునః॥ ౫౩॥

తా॥ నాడుచు గానంబుజేయుచున్న చిత్రరథాదిగంధర్వులను మహేశు నకు కర్ణకుండలంబులై, గీతంబుపాడుచున్న కపాలకంబళులనుపన్నగులను

ఇట్లెల్ల వారింగాంచి శ్రీరాముండు కృతార్థుండై హర్షగద్గద వాక్యంబుల ప్రణవపూర్వకంబుగా శివనామ పారాయణంబుఁ జేయుచు మరలమరల నమస్కారంబులు జేయుచుండెను.

ఇతిశ్రీపద్మపురాణే.

శ్రీమచ్ఛివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శివరాఘవసంవాదే శివప్రాదుర్భా
వోనామ చతుర్థోధ్యాయః.

ఇది పద్మపురాణంబున శ్రీకరంబై యుపనిషద్రూపమైనదియు
పరబ్రహ్మవిద్యయైనట్టి శివగీతలనెడు యోగశాస్త్రంబున
శివరాఘవ సంవాదంబున శివప్రాదుర్భావంబను
నాలవ యధ్యాయము ముగిసెను.

## పంచమో ఽధ్యాయః.

శ్రీ సూత ఉవాచ.

శ్లో॥ అథప్రాదురభూ త్తత్ర హిరణ్మయరథో మహాన్।
అనేకరత్నదివ్యాంశు కిం మ్మీరితదిగంతరః ॥ ౧॥
నదో్యోభా లికపంకాఢ్య మహాచక్రచతుష్టయః ॥
ముక్తాతోరణసంయుక్త శ్వేతచ్ఛత్రశతావృతః॥
౨॥ శుద్ధహేమఖలీనాఢ్య తురంగగణసంయుతః।
ముక్తావితానవిలస దూర్ధ్వదేశవృషధ్వజః ॥౩॥
మత్తవారణికాయుక్త పట్టతల్పోపశోభితః। పా
రిజాతతరూద్బుద్ధ పుష్పమాలాభిరంచితః ॥౪॥
మృగనాభిసముద్భూత కస్తూరీమదపంకిలః ॥ క
ర్పూరాగరుధూపోత్థ గంధాకృష్టమధువ్రతః॥౫॥
సంవర్తఘనఘోషాఢ్య నానావాద్య సమన్వితః।
వీణావేణుస్వనాసక్త కిన్నరీగణసంకులః॥ ౬॥ ఏ
వంద్రుష్ట్వారథశ్రేష్ఠం వృషము త్తీర్యశంకరః। అం
బయాసహిత స్తత్ర పట్టతల్పేవిశ త్తదా॥౭ ॥ సుర
నీరజనేత్రాణాం శ్వేతచామరచాలనైః । దివ్య
వ్యజనవాతైశ్చ పరివృష్టోనీలలోహితః॥ ౮॥

తా॥ సూతుండు చెప్పుచున్నాడు, ఓమునులారా పిమ్మటబంగారుమయం బైనఅనేక రత్న కాంతుల దిగంతంబులు మిరుమిట్లుగొన మహాచక్రంబులుగలిగి ముత్యాలతోరణంబుల విరాజితంబై అనేక శ్వేతచ్ఛత్రంబులుగలిగి స్వర్ణ భూషణభూషిత తురంగంబులుగలిగి ముక్తావితానశోభికంబైన పట్టతల్పంబు గలిగి పారిజాతపుష్పమా లాశోభితంబై కస్తూరిపంకిలంబై కపూరాగరుధూప గంధ వాసనాగతభృంగ శోభితంబై ప్రళయమేఘగర్జితంబునుంబోలు నానావాద్యధ్వనితోగూడి వీణావేణు ధ్వనులతోడ కిన్నరగణంబుల సేవిం

ప న్నొక రథంబు తన నెదుట కీర్తించిన సదాశివుండు పార్వతితోఁగూడ వృష
భరాజంబుదిగి యారథంబెక్కి యందుపట్టు తల్పంబుపైఁగూర్చుండి కిన్నర
స్త్రీలు వింజామరలు వీవ ప్రమోదంబుననుండ.

శ్లో॥ క్వణత్కంకణనిక్వానై ర్మంజుమంజీరశింజితైః ।
వీణావేణుస్వనైర్గీతైః పూర్ణమాసీజ్జగత్త్రయం॥౯

తా॥ అప్పుడు కంకణ నినాదంబుల మంజుమంజీరశబ్దంబుల వీణావేణు
గాన ధ్వనులముజ్జగంబులునిండ.

శ్లో॥ చలత్పత్త్రికులారావై శ్శ్వేతపారావతస్వనైః ॥
ఉన్నిద్రభూషారత్నానాం దర్శనాదేవబర్హిణః॥
౧౦॥ ననృతుర్దర్శయంతస్స్వాన్ చంద్రకాన్ కో
టిసంఖ్యయా । ప్రణమంతంతతోరామ ముత్థా
ప్యవృషభధ్వజః॥౧౧॥ ఆనినాయరథందివ్యం ప్ర
హృష్టేనాంతరాత్మనా । కమండలుజలైస్స్వస్య
స్వయమాచమ్యయత్నతః। సమాచమయ్యాపుర
తః స్వాంకేరామముపానయత్ ॥౧౨॥అథదివ్యం
ధనుస్తస్మై దద్వాతూణీరమక్షయం ॥ మహాపాశు
పతంనామ దివ్యమస్త్రందద్వాతతః॥౧౩॥ ఉక్తశ్చ
తేనరామోపి సాదరంచంద్రమౌళినా జగన్నాశ
నికంరౌద్ర ముగ్రమస్త్రమిదంనృప ॥ ౧౪॥అ
తోనేదంప్రయోక్తవ్యం సామాన్యేసమరాజిరే।
అస్యనాస్తి ప్రతీఘాత మస్త్రంవై భువనత్ర
యే । తస్మాత్ప్రాణాత్యయేరామ ప్రయోక్తవ్య
ముపస్థితే॥ ౧౫॥

తా॥ పారావతాది పక్షికుల కలకలధ్వనుల భూషణంబుల మణికాం
తులచే నెమళ్లు నృత్తంబులుజేయుచు ననేకవిధంబులనుండెనంత సదాశివుండు
తనకునమస్కరించుచుండు రామునత్యాదరంబున నెత్తి తనసమీపంబునంగూ

ర్పుండం బెట్టికొని కమండలూదకంబున నాచమించి రాముని నాచమింపంబం చి యాతనికి దివ్యంబైన ధనుస్సును అక్షయతూణీరంబుల పాశుపతాస్త్రం బును యిచ్చి యిట్లనిరి. ఓరామచంద్రా యీయస్త్రంబు నెచ్చట నెదురు లేకనుండు దీని సామాన్యయుద్ధంబుల ప్రయోగింపవలదు ప్రాణాత్యయంబు నం బ్రయోగించుము,

శ్లో॥ అన్యథైవప్రయుక్తంతు జగత్సంక్షయకృద్భవేత్ ॥౧౫॥ అథాహూయసురశ్రేష్ఠాన్ లోకపాలాన్మహేశ్వరః । ఉవాచపరమప్రీతః స్వంస్వమస్త్రంప్రయచ్ఛత॥ ౧౬ ॥ రాఘవోయంచతైరస్త్రైః రావణంచహనిష్యతి॥ ౧౭॥

తా॥ అకాలంబున ప్రయోగించిన జగత్సంహారం బొనర్చునని యాయ స్త్రప్రభావం బెఱింగించి యీశ్వరుండు ఇంద్రాదులంగాంచి మీమీయస్త్రం బుల నీరామునకొసంగుడు వానిచే రావణుంజంపు,

శ్లో॥ తస్యదేవైరవధ్యస్త్వ మితిదత్తోవరోమయా ॥ ౧౮ ॥ తస్మాద్వానరతామేత్య భవంతోయుద్ధదుర్మదాః సాహాయ్యమస్యకుర్వంతు తేనస్వస్థో భవిష్యతి॥ ౧౯॥

తా॥ పూర్వంబున నే నారావణునికి దేవదైత్యదానవులచేఁ జెడని వరం బిచ్చితింగాన మీరెల్ల వానరరూపంబులందాల్చి యితనికి సహాయులుగండు దానని తండుస్వస్థుండగు.

శ్లో॥ తదాజ్ఞాంశిరసాభ్యర్చ్య సురాఃప్రాంజలయస్తదా। ప్రణమ్యశరణంశంభుంస్వంస్వమస్త్రందదుర్ముదా। నారాయణాస్త్రందైత్యారి రౌద్రమస్త్రంపురందరః । బ్రహ్మోపిబ్రహ్మదండాస్త్ర మాగ్నేయాస్త్రంధనంజయః॥౨౦ ॥ యామ్యంయమశ్చ మోహాస్త్రంరక్షోరాజస్తదాదదౌ। వరుణో

వారుణంప్రాదా ద్వాయవ్యాస్త్రంప్రభంజనః ॥
౨౧ ॥ కౌబేరంచకుబేరోపి రౌద్రమీశానఏవ
చ। సౌరమస్త్రందదౌసూర్య స్సౌమ్యంసోమశ్చ
పార్వతం॥౨౨॥ విశ్వేదేవాదదు స్తస్మై వసవోవా
సవాభిధం। అధతుష్టఃప్రణమ్యేశం రామోదశ
రథాత్మజః। ప్రాంజలిఃప్రణతోభూత్వాభక్తియు
క్తోవ్యజిజ్ఞపత్ ॥ ౨౩॥

తా॥ అని యీశుం డాజ్ఞాపింప యమరులియ్యకొని నమస్కరించుచు ప్రాంజలులైతమతమయస్త్రంబుల రామునకిచ్చిరి. అది యెట్లంగించెద విష్ణు దేవుండు నారాయణాస్త్రంబును బ్రహ్మబ్రహ్మ దండంబును యగ్నియాగ్నె యంబును యముండు యామ్యంబును కుబేరుండు సమ్మోహనంబును వరుణుం డు వారుణంబును వాయువు వాయవ్యంబును ఈశానుండు రౌద్రంబును సూర్యుండు సౌరంబును చంద్రుండు సౌమ్యంబును విశ్వేదేవతలు పాశు పతంబును వసువులు వాసవాస్త్రంబును నిచ్చిరంత శ్రీరాముండు సంతోషం బున శివునకెరగి ప్రాంజలియై భక్తియుతుండై యిట్లని విన్నవించెను.

శ్లో॥ భగవన్మానుషైర్నైవ దుర్లంఘ్యోలవణాంబుధిః।
తత్రలంకాభిధందుర్గం దుర్జయందేవదానవైః ॥
౨౪ ॥ అనేకకోటయ స్తత్ర రాక్షసా బలవత్త
రాః॥ సర్వేస్వాధ్యాయనిరతా శ్శివభక్తాజితేం
ద్రియాః॥౨౫॥ అనేకమాయాసంయుక్తా బుద్ధి
మంతోగ్నిహోత్రిణః। కధమేకాకినాజేయా మ
యాభ్రాత్రాచసంయుగే॥ ౨౬॥

తా॥ ఓదేవదేవా మనుష్యులకు సముద్రంబుదాట నలవికాదు అందు లంకాపురంబు దేవదానవ దుర్జయంబై మహాబలులగు అనేకరాక్షస రక్షి తంబైయున్నది. యారక్కసులెల్ల స్వాధ్యాయపరులు శివభక్తియుతులు జితేంద్రియులు నిరతాగ్నిహోత్రులు బహుమాయావంతులు బుద్ధిమంతులై నవారు నేనొకండ నాతమ్మునితోగూడి వారల నెట్లు జయింపనేతుగా.

శ్రీభగవానువాచ:

శ్లో॥ రావణస్యవధేరామ రక్షసామపిమారణే। విచా
రోనత్వయాకార్య స్తస్యకాలోయమాగతః॥౨౮॥
అధర్మేతుప్రవృత్తాస్తే దేవబ్రాహ్మణపీడనైః। త
స్మాదాయుఃక్షయోజాతః తేషాంశ్రీరపిసువ్రత॥
౨౯॥ రాజస్త్రీలంఘనాసక్తం రావణంనిహ
నిష్యసి॥ ౨౯॥

అనిన శంభుం డిట్లనియె.

తా॥ఓరామచంద్రా యారావణుంజంపనారక్కసులవధింప నీకువిచారం
బువలదు. దానికిందగు కాలంబువచ్చె వారెల్ల దేవబ్రాహ్మణహింసకులైయధ
ర్మ ప్రవృత్తులై యుండుటంజేసి వారికాయువు శ్రీయునునశించె. రాజ
స్త్రీల నపహరించి బహు వ్యామోహితుండైన రావణుని జంపగలవాడవు.

శ్లో॥ పాపాసక్తోరిపుర్జేతుం సుకరస్సంగరాంగణే। అ
ధర్మనిరతశ్శత్రుర్భాగ్యైనైవోపలభ్యతే॥ ౩౦॥
అధీతవేదశాస్త్రోపి సదాధర్మరతోపివా। వినాశ
కాలేసంప్రాప్తే ధర్మమార్గాచ్చ్యుతోభవేత్॥
౩౧॥ పీడ్యంతేదేవతాస్సర్వా స్సతతంయేనపా
పినా। బ్రాహ్మణాఋషయశ్చైవ। తస్యనాశఃస్వ
యంస్థితః॥ ౩౨॥

తా॥ పాపాసక్తుండైనరిపుండు జయింపసులభుండు అధర్మ మార్గంబు
ననున్నరిపుండు భాగ్యవశంబుచే గలుగు సకలవేద శాస్త్రంబులుజదివి ధర్మ
రతుండైనను కాలవశంబున ధర్మమార్గచ్యుతుండగు సకలదేవతలను ముసు
లను బ్రాహ్మణులను బాధించుచు పాపియగు రావణునికి నాశంబాసన్నం
బై యున్నది.

శ్లో॥ కిష్కింధానగరేరామ దేవానా మంశసంభవాః । వానరాబహవోజాతా దుర్జ్ఞేయాజలవత్తరాః॥ 33॥

తా॥ కిష్కింధాపురంబున దేవాంశంబునంబుట్టి మహా బలులగు అనేక వానరు లున్నవారు.

శ్లో॥ సాహాయ్యంతేకరిష్యంతె తైర్బధ్వాచపయోనిధిం అనేకశైలసంబంధ సేతౌయాంతువలీముఖాః ॥3౪ ॥ రావణంసగణంహత్వా తామానయనిజప్రియాం॥ 3౪॥

తా॥ వారెల్లనీకుసాహాయ్యులగుదురు, వారలు అనేకపర్వతంబులందెచ్చి సముద్రంబున సేతువుంగట్టెదరు ఆమార్గంబున వానరులంగూడి సముద్రంబు దాటి సబలంబుగా రావణుంజంపి నీప్రియురాలిందెమ్ము.

శ్లో॥ శస్త్రైర్యుద్ధజయోయత్ర తత్రాస్త్రాణి నయోజయేత్। భిన్నాస్త్రేష్వల్పశస్త్రేషు । పలాయనపరేషుచ ॥3౫ ॥ అస్త్రాణిముంచత్దివ్యానిస్వయమేవవినశ్యతి । అథకింబహునోక్తేన మయైవోత్పాదితంజగత్॥ 3౬॥

తా॥ శస్త్రంబుల జయంబుగలుగుచుండ అస్త్రంబులేల శత్రువులుపలాయనపరులైయుండ దివ్యాస్త్రప్రయోగంబుజేయుట వినాశకారియగు వేయిమాటలేల యీజగంబెల్ల నావలనగలుగు.

శ్లో॥ మయైవపాల్యతేనిత్యం మయాసంహ్రియతేపిచ॥ అహమేకోజగన్మృత్యు ర్మృత్యోరపిమహీపతే॥ 3౬ ॥ గ్రసేహమేవసకలం జగదేతచ్చరాచరం । మమవక్త్రేహతాస్సర్వే రాక్షసాయుద్ధ

దుర్మదాః॥౩౭॥ నిమిత్తమాత్రింత్వంభూయాః।
కీర్తిమాప్స్యసిరాఘవ॥ ౩౮॥

తా॥ నాచేతనేరక్షింపంబడు నాచేతనేహతంబగు నేనోకండనే మృత్యువుకు మృత్యుండనగుదు జగంబెల్ల నాశంబుజేయుదు నాచేతనే మహాబలులగు రాక్షసులు హతంబగుదురు. నీవు రాక్షస నాశనంబునకు నిమిత్తమాత్రుండవై కీర్తింబొందుము అని మహేశుండు శ్రీరామునకుంజెప్పెను.

ఇతి శ్రీపద్మపురాణే.

శ్రీమచ్ఛివగీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే—శివరాఘవసంవాదేరామస్యాస్త్ర
ప్రాప్తిర్నామ పంచమోధ్యాయః.

ఇది శ్రీకరంబై యుపనిషద్రూపమైనదియు పరబ్రహ్మ విద్యయైనట్టి శివగీతలనెడు యోగశాస్త్రంబున రామునకస్త్ర ప్రాప్తిగల అయిదవ యధ్యాయము ముగిసెను.

## షష్ఠోధ్యాయః.

శ్రీరామ ఉవాచ.

శ్లో॥ భగవన్నత్ర మేచిత్రం మహాదేతత్ప్రజాయతే।
శుద్ధస్ఫటికసంకాశ స్త్రిణేత్రశ్చంద్రశేఖరః ॥ ౧॥
మూర్తస్త్వంతుపరిచ్ఛిన్నా కృతిఃపురుషరూప
ధృత్ । అంబయాసహితోత్రైవ రమసేప్రమ
థైస్సహ॥౨॥ త్వంకథంపంచభూతాని జగదేత
చ్చరాచరం। తద్బ్రూహిగిరిజాకాంతమయి తేను
గ్రహోయది॥ ౩॥

తా॥ శ్రీరాముండు చెప్పుచున్నాడు. ఓపరమేశా నీవలన నీజగంబుగలు గుట నాశ్చర్యంబు నీవు స్ఫటికసంకాశ విగ్రహంబుగలిగి త్రినేత్రుండవై పరిచ్ఛిన్నస్వరూపివై పురుషరూపధారివై అంబాసహితుండవై విహరించుచు ప్రమథులగూడియున్నవాడవు చరాచరాత్మకంబైన జగంబున పంచభూతంబు లెట్లు గల్గంజేసితివి దీని నాకతిదయం జెప్పుము.

శ్రీభగవానువాచ.

శ్లో॥ సాధుపృష్టంమహాభాగ దుర్జ్ఞేయ మమరైర
పి। తత్ప్రవక్ష్యామి తేభక్త్యా బ్రహ్మచర్యేణసువ్ర
త॥౪॥ పారంయాస్యస్యనాయాసా ద్యేనసంసార
నీరధేః॥ ౪౫॥

అనిన సదాశివుండిట్లనియె.

తా॥ ఓ రామచంద్రా మంచివిషయంబడిగితివి దేవతలకైన దుర్జ్ఞేయంబు అట్టిదానింజెప్పెద దానివిని బ్రహ్మచర్యంబున అనాయాసంబున సంసారసాగరంబు దాటంగలవు.

శ్లో॥ దృశ్యంతేపంచభూతాని యేచలోకా శ్చతుర్ద
శ ॥౫॥ సముద్రాఃపర్వతాదేవా రాక్షసాఋుష

యస్తథా। దృశ్యం తేయానిచాన్యాని స్థావరాణి చరాణిచ ॥౬॥ గంధర్వాః ప్రమథానాగాః సర్వే తేమద్విభూతయః॥ ౬౫॥

తా॥ పంచభూతంబులు పదునాలుగు లోకంబులు సముద్రంబులు పర్వతంబులు దేవాసురులు మునులు స్థావరజంగమాదులు గంధర్వులు నాగుంబులు ఇవియెల్ల నావిభూతులని యెఱుంగుము,

శ్లో॥ పురాబ్రహ్మాదయోదేవా ద్రష్టుకామామమా కృతిం। మందరంప్రయయుస్సర్వే మమప్రియతమంగిరిం॥ ౭౫॥

తా॥ పూర్వంబున బ్రహ్మాదిదేవతలు నాకతిప్రియంబైనమందరంబుజేరి నా రూపం బెరుంగం గోరుచుండ.

శ్లో॥ తాంశ్చదృష్ట్వామయాదేవాన్ లీలాకులితచేతసః। తేషామపహృతంజ్ఞానం। బ్రహ్మాదీనాందివౌకసాం॥౮౫॥ అథతేసహృతజ్ఞానా మామాహుః కోభవానితి। అథాబ్రువమహందేవా నహామేవ పురాతనః॥౯౫॥ ఆసంప్రథమమేవాహంవర్తామి చసురేశ్వరాః॥ ౧౦॥

తా॥ వారలంగాంచి నేవారిజ్ఞానంబులపహరింప వారలు నన్నుంగాంచి నీవెవ్వండవనియడుగ నేవారలతో నిట్లంటి. ఓదేవతలారా నేపురాతనుం నేనే ప్రథమంబునం గలిగి వర్తింతు.

శ్లో॥ భవిష్యామిచలోకేస్మిన్ మత్తోనాన్యోస్తికశ్చన। వ్యతిరిక్తంనమత్తోస్తి నాన్యత్కించిత్సురేశ్వరాః॥ ౧౧॥

తా॥ నాకన్న మరియొకండు లోకంబులలేదు నాకంటెనొండెద్ది యన్యంబులేదు.

శ్లో॥ నిత్యానిత్యోహమనఘః। బ్రహ్మాణాంబ్రహ్మణస్ప
తిః। దక్షిణాంచ ఉదంచోహం ప్రాంచఃప్రత్యం
చపవచ॥ ౧౨॥ అథశ్చోర్ధ్వాంచవిదిశో దిశశ్చా
హంసురేశ్వరాః। సావిత్రీసాపిగాయత్రీ స్త్రీపు
మానపుమానహం॥ ౧౩॥

తా॥ నేనిత్యుండ అనఘుండ బ్రహ్మణస్పతిని దక్షిణయునుదంచంబు ప్రాంచంబు ప్రత్యంచంబు ఊర్ధ్వంబు దిశలువిదిశలు సావిత్రీగాయత్రులు స్త్రీపురుష నపుంసకులు.

శ్లో॥ త్రిష్టుప్ గత్యనుష్టుచ్ఛపఙ్క్తిఛందస్త్రయీమయః।
సంఖ్యోహంసర్వతశ్శాంత స్త్రేతాగ్ని ర్గారహం
గురుః॥౧౪॥ గౌరహంగహ్వరంచాహం। ద్వ్యార
హంజగతాంప్రభుః। జ్యేష్ఠస్సర్వసురశ్రేష్ఠో వర్షి
ష్ఠోహమపాంపతిః॥౧౫॥ ఆద్యోహంభగవానీశ
స్తేజోహంవిధిరవ్యహం। ఋగ్వేదోహంయజుర్వే
దస్సామవేదోహమాత్మభూః॥౧౬॥ అథర్వణశ్చ
మంత్రోహంతథాచాంగిరసాంవరః। ఇతిహాసాః
పురాణానికల్పోహంకల్పవానహం॥౧౭॥సరోహ
మస్మ్యగాధోహంవిద్యోపనిషదోహ్యహం॥ ౧౮॥

తా॥ త్రిష్టుపగనుష్టుపులు పఙ్క్తిఛందంబు సంఖ్యంబు శాంతంబు త్రేతాగ్నులు గురువు గోవుగహ్వరంబు ద్యోదివంబులునేన సర్వంబున కధికారినేన మరియునే సర్వసురశ్రేష్ఠుండ వర్షిష్ఠుండ సముద్రుండ సకలంబున కాద్యుండ తేజోరూపుండ ఋగ్యజుస్సామాధర్వణరూపుండ సకల మంత్రరూపుండ ఇతిహాసపురాణ కల్పరూపుండ సరోవరంబగాధంబు విద్యోపనిషత్తులు సర్వంబు నన్నుంగా నెఱుంగుము.

శ్లో॥ శ్లోకాస్సూత్రాణిచైవాహం మనువ్యాఖ్యానమే
వచ॥౧౯॥ వ్యాఖ్యానానిపరావిద్యా ఇష్టంహు

తమథాహుతం ॥ దత్తాదత్తమహంలోకః పర
లోకోహమక్షరః॥ ౧౯॥

తా॥ ఓరామచంద్రా సూత్రంబులు మనువ్యాఖ్యానంబాదిగాగల వ్యాఖ్యానంబులు పరావిద్యయు ఇష్టంబుహుతంబహుతంబు నేన దత్తాదత్తంబులు ఇహపరలోకంబులు అక్షరంబు.

శ్లో॥ క్షరస్సర్వాణిభూతానిశాంతిఃక్షాంతిరహంఖగః।
గుహ్యోహం సర్వవేదేషు అరణ్యోహమజో
స్మ్యహం॥౨౦॥పుష్కరంచపవిత్రంచ మధ్యంచా
హంతతఃపరం। బహిశ్చాహంతథాచాంతః పుర
స్తాదహమవ్యయః॥ ౨౧ ॥ జ్యోతిశ్చాహం తమ
శ్చాహం తన్మాత్రాణీంద్రియాణ్యహం।

తా॥ క్షరంబు సర్వభూతంబులు నేన మరియు శాంతియుక్షాంతియు సర్వవేదగుహ్యంబుఖగంబు అరణ్యంబజంబు పుష్కరంబు పవిత్రంబు మధ్య బహిరంతరంబులు నేన అవ్యయుండ జ్యోతిరూపుండతమోమయుండ నేన తన్మాత్రలు సకలేంద్రియంబులు నేనైయుందు.

శ్లో॥ బుద్ధిశ్చాహమహంకారో విషయాణ్యహమేవ
వా॥౨౨॥ బ్రహ్మావిష్ణుర్మహేశోహ ముమాస్కం
దోవినాయకః। ఇంద్రోగ్నిశ్చయమశ్చాహం ని
ఋతిర్వరుణోనిలః॥౨౩॥ కుబేరోహంతథేశానో
భూర్భువస్స్వర్మహర్జనః । తపస్సత్యంచపృథివీ
చాపస్తేజోనిలోప్యహం॥౨౪ ॥ ఆకాశోహంరవి
స్సోమో నక్షత్రాణిగ్రహోప్యహం।

తా॥ బుద్ధియు నహంకారంబు సర్వవిషయంబులు బ్రహ్మావిష్ణుమహేశుల పార్వతియు కుమారుండు ఇంద్రుండు అగ్నియుయముండు నిఋతియు వరుణుండనిలుండు కుబేరుండీశానుండు నేనైయుందు మరియు భూర్భువాదు

తపస్సత్యంబులు పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులు సూర్యచంద్రులు నక్షత్రంబులు నవగ్రహంబులు నేనై యుంద.

శ్లో॥ ప్రాణఃకాలస్తథామృత్యు రమృతం భూతమవ్యహం॥౨౫॥ భవ్యంభవిష్యత్కృత్స్నంచ విశ్వస్యాత్మకోప్యహం। ఓమాద్యాచతథామధ్యేభూర్భువస్స్వస్తథైవచ॥ ౨౬ ॥ అంతేహంవిశ్వరూపోస్మి శిష్టంచజగతఃసదా। అశ్నితం పాయితం చాహం కృతంవాకృతమవ్యహం॥౨౭॥ పరంచైవాపరంచాహ మహంచైవపరాయణః॥ అహం జగదిదందివ్య మక్షరంసూక్ష్మమవ్యయం॥ ౨౮॥ ప్రాజాపత్యంపవిత్రంచ సౌమ్యమగ్రాహ్యమగ్రియః। అహమేకోపిసంహర్తా మహాగ్రాసోజగన్నిధిః॥౨౯॥ హృదియోదేవతాత్వేన ప్రాణత్వేనప్రతిష్ఠితః। శిరశ్చోత్తరతోయస్య పాదాదక్షిణతస్తథా॥౩౦॥ యశ్చసర్వోత్తరస్సాక్షాదోంకారోహంత్రిమాత్రకః। ఊర్ధ్వమున్నమయేయస్మాద్భక్తాన్నైవనయామ్యధః। తస్మాదోంకారఏవాహమేకోనిత్యస్సనాతనః॥ ౩౧॥

తా॥ మరియు ప్రాణంబు కాలంబు మృత్యువు అమృతంబు భూతభవ్యభవిష్యంబులెల్ల నేన నేసర్వాత్మకుండ ఆదిని ఓంకారరూపుండ మధ్యంబున భూర్భువాదిరూపుండ అంతంబున విశ్వరూపినైయుంద. శిష్టంబు అశ్నితంబు పాయితంబు కృతంబకృతంబు పరంబపరంబు పరాయణంబును నేన యీజగంబెల్ల నేనైయుంద మరియు సూక్ష్మంబు అవ్యయంబు ప్రాజాపత్యంబు పవిత్రంబు సౌమ్యంబు గ్రాహ్యంబగ్రియంబు నేన యీ లోకంబుల సంహరించువాడ నేన మహాగ్రాసంబు జగన్నిధియు నేన నేనసకలదేవతలకును ప్రాణరూపుండనైయుంద నాశిరంబుత్తరంబున పాదంబులు దక్షిణంబున నుండు నేసర్వోత్తరుండనైయుంద మూడుమాత్రలుగల ఓంకారంబును భక్త

లకూర్థ్వంబు గా నెఱింగింతు గాన నే నోంకారరూపుండ నిత్యుండ సనాత నుండ నై యుందు.

శ్లో॥ ఋచోయజూంషిసామాని యోబ్రహ్మాయజ్ఞకర్మణి। ప్రణామయేబ్రాహ్మణేభ్య స్తేనాహంప్రణవోమతః॥౩౨॥ స్నేహేయథామాంసపిండం। వ్యాప్నోతివ్యాపయత్యపి। సర్వాఁల్లోకానహం తద్వత్సర్వవ్యాపీ తతోస్మ్యహం॥ ౩౩॥ బ్రహ్మా హరిశ్చభగవా నాద్యంతంనోపలబ్ధవాన్। తతో న్యేచసురాయస్మా దనంతోహ మతోస్మ్యహం॥ ౩౪॥ గర్భజన్మజరామృత్యు సంసారభయసాగరాత్। తారయామితతోభక్తం తస్మాత్తారోహమీరితః॥ ౩౫॥ చతుర్విధేషు దేహేషు జీవత్వేనవసామ్యహం। సూక్ష్మోభూత్వాచహృద్దేశే। యత్తత్సూక్ష్మఃప్రకీర్తితః॥ ౩౬॥

తా॥ మఱియు యజుస్సామాదులు నేన నే యజ్ఞాదికర్మంబులు బ్రహ్మనై బ్రాహ్మణులకు ప్రణవం బుపదేశింతు గాన ప్రణవరూపుండ నైతి మాంసపిండంబు రీతి నే సర్వలోకంబులనుందు గాన సర్వవ్యాపి నైతి. బ్రహ్మవిష్ణ్వాదిదేవతలెల్ల నాయాద్యంతంబుల నెఱుంగరు గాన నేననంతుండ నైతి భక్తులజన్మజరామృత్యు భయంబులుగల సంసారసాగరంబువలన తరింపంజేయుదు గాన తారుండనంబరగుదు చతుర్విధ జీవరాసుల సూక్ష్మంబుగా జీవరూపుండనై యుందుంగాన సూక్ష్ముండ నైతి.

శ్లో॥ మహాతమసిమగ్నేభ్యోభక్తేభ్యోయత్ప్రకాశతే। విద్యుద్వదతులంరూపం యస్మాద్వైద్యుతమస్మ్యహం॥ ౩౭॥ ఏకఏవయతోలోకాన్ విసృజామిసృజామ్యహం సర్వాఁల్లోకాన్ యదీశోహమీశానీభిఃస్వశక్తిభిః॥ ౩౮ ॥ ఈశానమస్యజగత

సుదృశంచక్షురీశ్వరం । ఈశానమింద్రః స్థాస్నుశ్చ సర్వేషామపిసర్వదా॥ ౩౯ ॥ ఉతామృతత్వస్యేశానః యదన్నేనాతిరోహతి। ఈశానఃసర్వవిద్యానాం యదీశానస్తదస్మ్యహం॥ ౪౦॥

తా॥ మహాతమంబున మగ్నులైనభక్తులకు విద్యుద్రూపంబున వెలుంగుదుంగాన వైద్యుతుండననంబరగుదు. ఏనాకంటన సకలలోకంబుల సృజింపుచు సంహరింపుచు స్వశక్తులంగూడి జగంబులకు నేత్రప్రాయుండనై రక్షింపుచు సర్వంబునకధికారినై స్థాణురూపుండనై అమృతరూపియు నన్నప్రదాయియునై సర్వవిద్యల నిచ్చువాడనైయుందుగాన నే నీశానుండనసంబరగుదు.

శ్లో॥ సర్వాన్భావాన్య దీక్షేహ మాత్మజ్ఞానం నిరీక్షయే। యోగంచగమయేయస్మాద్భక్తంచోత్తమయోగతః॥ ౪౧॥ అజస్రంయశ్చగృహ్ణాతి విసృజామిసృజామిచ। సర్వాన్లోకాన్వాసయామి తేనాహంవై మహేశ్వరః॥ ౪౨॥

తా॥ సకలభావంబుల నాత్మజ్ఞానంబుచే దెలిసికొని భక్తులకాత్మయోగప్రదాతనై సకలలోకనివాసినై సర్వంబునుగ్రహించుచు విసర్జించుచుందుగాన మహేశుండనైతి.

శ్లో॥ మహాత్మ్యాత్మజ్ఞానయోగైశ్వర్యేయస్తుమహీయతే। సర్వాన్భావాన్పరిత్యజ్య మహాదేవశ్చసోస్మ్యహం॥ ౪౩॥ ఏషోస్మి దేవః ప్రదిశోనుసర్వాఃపూర్వోహిజాతోస్మ్యహమేవగర్భే । అహంహిజాతశ్చజనిష్యమాణః ప్రత్యఙ్ముఖస్తిష్ఠతిసర్వతోముఖః॥౪౪॥ విశ్వతశ్చక్షురుతవిశ్వతోముఖో విశ్వతోహస్తఉతవిశ్వతస్స్యాత్ ।సంబాహుభ్యాంనమతిసంపతత్రైర్ద్యావాపృథివీజనయన్దేవఏకః॥

తా॥ మహాజ్ఞానయోగైశ్వర్యంబందు సర్వంబునువిడిచి వెలుంగుదుంగా న మహాదేవుండనైతి నేసకలదిక్కుల విదిక్కుల నెల్లరకు నాదియందుజనించి యు జనిష్యమాణుండనై సర్వతోముఖుండనై లోకంబులకెల్ల నేత్రప్రా యుండనై హస్తంబులరీతి ద్యావాపృధివుల సంచరింతు.

శ్లో॥ వాలాగ్రమాత్రంహృదయస్య మధ్యేవిశ్వేదేవం జాతవేదసంవరేణ్యం। మామాత్మస్థంయేనుప శ్యంతిధీరాస్తేషాంశాంతిశ్శాశ్వతీ నేతరేషాం॥ ౪౬॥ అహంయోనిమధితిష్ఠ త్యేకోమయేదం పూర్ణం పంచవిధంచసర్వం। మామీశానంపు రుషందేవమీడ్యంవరేణ్యంనీచాయ్యేమాంశాం తిమత్యంతమేతి॥౪౭॥ ప్రాణేష్వంతర్మనసోలింగ మాహుర్యస్మిన్ క్రోధోయాచతృష్ణాక్షమాచ॥ తృష్ణాంఛిత్వాహేతుజాలస్యమూలం।బుధ్యాసం చిత్యస్థాపయిత్వామయీహా॥౪౮॥ ఏవంయే మాంధ్యాయమానాభజంతే తేషాంశాంతిశ్శా శ్వతీనేతరేషాం। యతోవాచోనివర్తంతేఅప్రా ప్యమనసాసహ। ఆనందంబ్రహ్మమాంజ్ఞాత్వాన భిభేతికుతశ్చన।

తా॥ సకలమనంబుల వాలాగ్రమాత్రంబుగానుండి విశ్వదేవుండనై జా తవేదుండనైయున్న నన్నెరుంగువారలకు శాంతి శాశ్వతంబుగాగలుగు నితరు లకుంగలుగదు. నేసకలంబునకుం గారణుండ పంచభూతాత్మికంబైన జగం బెల్ల నావలనంగల్గు నిట్టి నన్నెరుంగువారికి శాంతిగలుగు సకలహృదయంబు ల లింగభూతుండనైయుందు. కామక్రోధలోభాదులవిడిచి బుద్ధి నాయం దుంచి నన్నేధ్యానించుచున్నవారలకే శాంతికలుగు. మనోవాక్కుల కలవి గాక బ్రహ్మానందమయుండనైయున్న నన్నెరుంగువారల కెచ్చటను భయం బులేదు.

శ్లో॥ శ్రుత్వేతిదేవామద్వాక్యం కైవల్యం జ్ఞానము
త్తమం । జపంతో మమనామాని మమధ్యాన
పరాయణాః । సర్వేతే సర్వదేహాంతే మత్సా
యుజ్యం గతాస్సురాః । అతోఽయే పరిదృశ్యం
తే । పదార్థా మద్విభూతయః । మయ్యేవసక
లంజాతం। మయిసర్వంప్రతిష్ఠితం । మయిసర్వం
లయంయాతి తద్బ్రహ్మాద్వయమస్మ్యహం।అణో
రణీయానహమేవతద్వన్మహానహంవిశ్వమిదంవి
చిత్రం। పురాతనోఽహంపురుషోఽహమీశోహిర
ణ్మయోఽహంశివరూపమస్మి । అపాణిపాదోఽహ
మచింత్యశక్తిః పశ్యామ్యచక్షుస్సశృణోమ్యక
ర్ణః॥ అహంవిజానామివివిక్తరూపోనచాస్తివేత్తా
మమచిత్సదాహం। వేదైరనేకైరహమేవవేద్యో
వేదాంతకృద్వేదవిదేవచాహం । నపుణ్యపాపే
మమనాస్తినాశోనజన్మదేహేంద్రియబుద్ధిరస్తి।
నభూమిరాపోనచవహ్నిరస్తి నచానిలోమేస్తిన
చాంబరంచ । ఏవంవిదిత్వా పరమాత్మరూపం
గుహాశయం నిష్కళమద్వితీయం । సమస్తసా
క్షింసదసద్విభాగం ప్రయాతిశుద్ధం పరమాత్మ
రూపం ॥ ఏవంమాంతత్వతోవేత్తి యస్తురామ
మహీపతే । సఏవనాన్యోలోకేషు । కైవల్యం
ఫలమశ్నుతే।

తా॥ సకలదేవతలును మద్వాక్యంబులవిని మన్నామంబుల జపించుచు నాధ్యానంబేసేయుచు దేహాంతంబున మత్సాయుజ్యంబునొందుదురు. దృశ్యమానంబులగు పదార్థంబులెల్ల నావిభూతులైయుండు నాయందే సకలంబుజనించి సుప్రతిష్ఠితంబైయుండి లయంబునొందు సేనణువుకణువై మహత్తుల

కధికుండనై పురాణపురుషుండనై సకలంబునకధికారినై హిరణ్మయుండ శివరూపియునై పాణిపాదంబులులేక అచింత్యశక్తిగల్గి కన్నులులేక సకలంబునుంజూచుచు చెవులులేక సకలంబువినుచు వివిక్తరూపుండ చిత్స్వరూపుండనై సకలంబెఱుంగుచుందు వేదంబుల నన్నెఱుంగనగు నే వేదాంతంబు వెలుంగుదు నాకు పుణ్యపాపంబులు జన్మనాశంబులు లేవు పృథివ్యప్తేజో వాయ్వాకాశంబులు లేవు నేగుహాశయుండ నిష్కళుండ నద్వితీయుండ సమస్తసాక్షినై యుందు పరిశుద్ధంబైన నాయాత్మస్వరూపం బెఱింగినవాడు కైవల్యంబునొందు యితరుల కలవిగాదని మహాదేవుండు శ్రీరామచంద్రునకు జెప్పెను.

ఇతి శ్రీపద్మపురాణే.

శ్రీమచ్ఛివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే—శివరాఘవసంవాదే విభూతి
యోగోనామ షష్ఠోధ్యాయః.

ఇది పద్మపురాణంబున శ్రీకరంబై యుపనిషద్రూపమైనదియు
పరబ్రహ్మవిద్యయైనట్టి శివగీతలనెడు యోగశాస్త్రంబున
శివరాఘవ సంవాదరూపంబైన విభూతియోగంబను
నారవ యధ్యాయము ముగిసెను.

---

## సప్తమో ధ్యాయః

### శ్రీరామ ఉవాచ.

శ్లో ॥ భగవన్యన్మయాపృష్టం తత్తథైవస్థితంవిభో । తత్రోత్తరంమయాలబ్ధం త్వత్తోనైవమహేశ్వర ॥ ౧ ॥ పరిచ్ఛిన్నపరీమాణేదేహేభగవతస్తవ । ఉత్పత్తిః పంచభూతానాం స్థితిశ్చావిలయఃకథం ॥౨॥ స్వస్వాధికారసంబంధానానాస్థానస్థితాస్సురాః । తేసర్వేత్వంకథం దేవభువనానిచతుర్దశ ॥౩॥ త్వత్తశ్శ్రుత్వాపిదేవాత్ర సందేహోమహానభూత్ । అప్రత్యయితచిత్తస్య సంశయంఛేత్తుమర్హసి॥ ౪॥

### శ్రీరాముండు జెప్పుచున్నాడు.

తా॥ ఓదేవా నేనడిగినప్రశ్నంబున కుత్తరంబు మీరుజెప్పలేదు పరిచ్ఛిన్నప్రమాణంబైన మీదేహంబున పంచభూతంబు లెట్లుగల్గు నెట్లుండు నెట్లు నశించు వారివారి యధికారంబుల నానాస్థానంబులనుండు దేవతలెల్లను చతుర్దశలోకంబులు నీవెట్లయితివి. ఓదేవదేవా నీవుజెప్పినట్లు వినియు నాకు మిక్కిలి సందియంబుగలిగెడు అస్వస్థచిత్తుండనైన నాసంశయంబుపోగొట్టుమని రాముండు వేడిన,

### శ్రీభగవానువాచ.

శ్లో ॥ వటబీజేతిసూక్ష్మేపి మహాన్వటతరుర్యథా । సర్వదాస్తేస్యథావృక్షః కుతఆయాతితద్వద ॥ ౫ ॥ తద్వన్మమతనోరామభూతానామాగతిర్లయః। మహాక్షాసైంధవపిండోపిజలేక్షిప్తావిలీయతే । నదృశ్యతేపునఃపాకాత్ తతఆయాతిపూర్వవత్

॥౬॥ పాతఃప్రాతర్యథాలోకో జాయతేసూర్య మండలాత్ । ఏవంమత్తోజగత్సర్వం జాయతే స్మిన్విలీయతే ॥౭॥ మయ్యేవసకలంరామ తద్వ జ్జానీహిసువ్రత॥ ౮॥

మహాదేవుం డిట్లనియె.

తా॥ ఓరామచంద్రా అతిసూక్ష్మంబైన వటబీజంబున గొప్పవటవృక్షంబు గలిగినట్లు నాశరీరంబువలన సకలభూతంబులు జనించుననంగు మహాలవణ పిండంబు జలంబునంబడియణంగి పాకంబుచే రూపంబులేకనుండి మరల పూ ర్వంబువలెనగు సూర్యమండలంబుచే ప్రతిప్రాతఃకాలంబును గలుగుచుం డునట్లు లోకంబులెల్ల నాయందుగలుగుననంగు చుండునని యెరుంగుమనిన,

శ్రీరామ ఉవాచ.

శ్లో॥ కథితేపిమహాభాగ దిజ్మాథస్యయథాదిశాం నివ ర్తతేభ్రిమో నైవ । తద్వన్మమకరోమికిం ॥౯॥

శ్రీరాముం డిట్లనియె.

తా॥ ఓదేవదేవా మీరెన్నివిధంబులంజెప్పినను దిగ్భ్రాంతిగలవానికి భ్రిమగలిగినట్లు నాకేదియు నెరుంగదయ్యె నేనేమిచేయుననిన.

శ్రీ భగవానువాచ.

శ్లో॥ మయిసర్వంయథారామ జగదేతచ్చరాచరం । వర్తతేతద్దర్శయామినదృష్టుంక్షమతేభవాన్ ॥౧౦॥ దివ్యంచక్షుః ప్రదాస్యామితుభ్యందశర థాత్మజ । తేనపశ్యభయంత్యక్త్వా మత్తేజోమం డలంధ్రువం ॥౧౧॥ నచర్మచక్షుసాదృష్టుంశక్య తేమామకంమహః । నరేణవాసురేణాపితన్మ మానుగ్రహంవినా ॥౧౨॥ ఇత్యుక్త్వాప్రదదౌ తస్మై దివ్యంచక్షుర్మహేశ్వరః । అథాదర్శయ దేతస్మై వక్త్రంపాతాళసన్నిభం ॥౧౩॥ విద్యు

తోకోటిసరిభం దివ్య మతిభీమం భయావహం। త
ద్దృష్ట్వైవభయాద్రామోజానుభ్యామ వనీంగ
తః ॥ ౧౪ ॥ ప్రణమ్యదండవద్భూమౌతుష్టావచ
పునఃపునః॥౧౪౫॥ అథోద్ధాయమహావీరఃయావ
దేవపరిపశ్యతి । వక్త్రింపురభిదస్తత్ర హంతబ్ర
హ్మాండకోటయః ॥ చటకాఇవలక్ష్యంతే జ్వాలా
జాలాసమాకులాః॥౧౬॥ మేరుమందరవింధ్యాది
గిరయస్సప్తసాగరాః ॥ దృశ్యంతేచంద్రసూర్యా
ద్యాఃపంచభూతానితేసురాః॥౧౭॥ అరణ్యానిమ
హానాగా భువనానిచతుర్దశ । ప్రతిబ్రహ్మాండమే
వంతు దృష్ట్వాదశరథాత్మజః ॥౧౮ ॥ సురాసు
రాణాంసంగ్రామాం స్తత్రపూర్వాపరానపి । వి
ష్ణోర్దశావతారాంశ్చ తత్కర్తవ్యానిచద్విజాః॥
౧౯ ॥ పరాభవాంశ్చదేవానాం పురదాహంమ
హేశితుః। ఉత్పద్యమానానుత్పన్నాం త్సర్వాన
పివినశ్యతః॥౨౦॥ దృష్ట్వారామోభయావిష్టః ప్ర
ణనామముహుర్ముహుః । ఉత్పన్నతత్వవిజ్ఞానో
బభూవనృపనందనః ॥ అథోపనిషదాంసారై ర
ర్థైస్తుష్టావశంకరం॥ ౨౧॥

శంభుండు చెప్పుచున్నాడు.

తా॥ ఓరామచంద్రా చరాచరాత్మకంబులైన జగంబులెల్ల నాయందుం
డు దాని నీకుంజూపెద యీచర్మచక్షువులచే నీవు జూడంజాలవు నీకే దివ్య
దృష్టినిచ్చెద దానిచే భయంబువిడిచి నాతేజోమండలంబుంజూడుము. నరు
లైన దేవాసురులైన నాయనుగ్రహంబులేక నన్నుంగాంచనేరరని మహే
శుండు రామునకు దివ్యదృష్టినిచ్చి పాతాళసదృశంబును విద్యుత్కోటికాం
తిగలదియు అతిభయంకరంబైన తనముఖంబుఁజూపిన రాముండతిభయంబున

మోకాళ్లనూదుకొనుచు నేలంబడి మరలలేచి దండప్రణామంబులు గావించి యనేకవిధంబులంబొగడుచు నాదేవదేవుని ముఖంబుగాంచి యందు అనేక బ్రహ్మాండకోటులు ధగద్ధగాయమానంబులై అణుమాత్రంబులుగా నుండంజూచి వానియందు మేరుమందరవింధ్యాది పర్వతంబులను సప్తసముద్రంబుల చంద్రసూర్యుల పంచభూతంబుల అరణ్యంబుల నాగంబుల పదునాలుగులోకంబుల ననేకబ్రహ్మాండంబుల మరియు సురాసురసంగరంబుల విష్ణుదేవుని దశావతారంబుల తత్కర్మంబుల త్రిపురాసుర యుద్ధంబులపుట్టినవారి పుట్టబోవువారిని నివి యెల్లంగాంచి శ్రీరాముండు భయంబంది యాదేవదేవునకు మరలమరల నమస్కరించుచు తత్వజ్ఞానంబునొంది వేదసారంబులైన స్తుతుల నిట్లనిపొగడె.

శ్రీరామ ఉవాచ.

శ్లో॥ దేవప్రపన్నార్తి హారప్రసీద విశ్వేశ విశ్వేశ్వర విశ్వవంద్య ప్రసీదగంగాధర చంద్రమౌళేమాం త్రాహిసంసారభయాదనాథం ॥౨౨॥ త్వత్తోహిజాతంజగదేతదీశ త్వయ్యేవభూతానివసంతి నిత్యం। త్వయ్యేవశంభోవిలయంప్రయాంతి భూమౌయథావృక్షలతాదయోపి॥౨౩॥ మహేంద్రరుద్రాగ్నిమరుద్గణాశ్చగంధర్వయక్షా స్సురసిద్ధసంఘాః। గంగాదినద్యోవరుణాలయాశ్చ వసంతిశూలిన్తవవక్త్రయంత్రే॥౨౪॥త్వన్మాయయాకల్పితమిందు మౌళేత్వయ్యేవదృశ్యత్వ ముపైతివిశ్వం॥ భ్రాంత్యాజనఃపశ్యతి విశ్వమేతచ్ఛుక్త్యాయథారౌప్యమహించరజ్జౌ॥౨౫॥ తేజోభిరాపూర్యజగత్స మగ్రంప్రకాశయత్యగ్ని శశాంకభానూః॥ వినాప్రకాశంతవదేవదేవ నదృశ్యతే విశ్వమిదంక్షణేన॥౨౬॥ అల్పాశ్రయోనైవబృహంతమర్థం ధత్తేణురేణోనహివింధ్యశైలం।త్వ

ద్వ్యక్తిరియం త్రేజగదేతదస్తి త్వన్మాయమెవైతి వి
నిశ్చినోమి॥౨౬॥ రజ్జౌభుజంగోభయదోయథై
వనజాయతేనాస్తినచైవనాశః। త్వన్మాయయాకే
వలమాత్మ రూపంతథైవ విశ్వంతవ నీలకంఠ ॥
౨౭॥ విచార్యమాణేతవయచ్ఛరీర మాధారభా
వంజగతాముపైతితదప్యవశ్యంయదవిద్యయైవ॥౨౮॥

తా॥ ఓదేవదేవా విశ్వనాథా విశ్వరూపా ప్రపన్నార్తినివారణా ఓగం
గాధరా నన్నుంగావుము సకలభూతంబులెల్ల భూమిని వృక్షలతాదులంబోలె
నీయందుబుట్టు వృద్ధినొందులయంబుసం బొందు ఓదేవా నీముఖంబున ఇం
ద్రాద్యమరబృందంబులు గంగాదినదులు సప్తసాగరంబులు. గానంబడుచు
న్నవి యీవిశ్వంబెల్ల నీమాయచేగల్గి నీయందగానంబడు యెట్టివారయిన
శుక్తియందు రజతభ్రాంతియు రజ్జువందు సర్పభ్రాంతియుంబోలె జగంబు
వేరనిభ్రాంతి నొందుదురు,నీస్వతేజంబున సూర్యచంద్రాగ్నులంబోలె జగం
బుల వెలుంగంజేయుదువు. అణువువింధ్యంబుతో సరిగానియట్లు యిత
రుండు నీకుసదృశుండుగాడు నీమొగంబున జగంబులెల్ల మాయచేసణంగియుం
డు నీకు జననమరణంబులులేవు విచారింపనీశరీరంబే సకలజగంబుల కాధా
రంబుగానున్నది.

శ్లో॥ పూర్ణశ్చిదానందమయో యతస్త్వం ॥ ౨౯॥
పూజ్యేష్టపూర్తాదిపరక్రియాణాంభోక్తాఫలంయ
చ్ఛసియత్త్వమేవ। మృషైతదేవం వచనంపురా
రేత్వత్తోస్తిభిన్నంనహికించిదేవ ॥౩౦॥ అజ్ఞాన
మూఢామునయో వదంతిపూజోపహారాదిపర
క్రియాభిః। తోషంగిరీశోభజతీతిమిథ్యా కుతస్త్వ
మూర్తస్య తుభోగలిప్సా॥౩౧॥ కించిద్దళంవా
చుళుకోదకంవాయస్త్వంమహేశప్రతిగృహ్యధ
త్సే। త్రైలోక్యలక్ష్మీమపియజ్జనేభ్య స్సర్వంత్వవి
ద్యాకృతమేవమన్యే ॥౩౨॥ ప్రాప్నోషిసర్వావి

దిశోదిశశ్చ త్వంవిశ్వమేకఃపురుషః పురాణః। న
ష్టేపితస్మిం స్తవనాస్తిహానిః। ఘటేవినష్టే నభ
సోయథైవ ॥౩౩॥ యథైవమాకాశగమర్క
బింబంక్షుద్రేషుపాత్రేషుజలాన్వితేషు । భజ
త్యనేకప్రతిబింబభావం। తథాత్వమంతః కరణే
షుదేవ॥ ౩౪॥

తా॥పూర్ణుండవుపురాణుండవీవఇష్టాపూర్తాదికంబులైనయజ్ఞభోక్తవుపత
ఫలప్రదాతయును నీవ నీకన్న భిన్నంబెద్దియునులేదు జ్ఞానహీనులగు కొం
దరు పూజోపహారాదుల తృప్తుండవగుదువని నిన్ను వచింతు రజమిధ్యగా
నుండు అమూర్తుండవగు నీకు వాంఛయెట్లుగలుగు చుళుకమాత్రంబైన జలం
బు నీకర్పణంబుజేయువానికి త్రిలోకరాజ్యంబిత్తువు నితరులకివ్వంజాలవు స
కలదిక్కులవిదిక్కుల నిండిపూర్ణుండవై ఏకరూపంబుగానుందువు జగంబెల్ల
నశించినను ఘటంబునశించిన నాకాశంబునకు హానిలేనియటుల నీవు నశిం
చవు ఆకాశంబుననుండు నర్కబింబంబుక్షుద్రపాత్రజలంబుల ప్రతిఫలించు
నట్లు నీవఖిలాంతరంగంబుల వ్యాపించియుందువు.

శ్లో॥ సంసర్జనేవాప్యవనేవినాశే విశ్వస్యకించిత్తవనా
స్తికార్యం॥ అనాదిభిర్దేహభృతామదృష్టైస్తథా
పితత్స్వప్నవదాతనోషి॥౩౫॥ స్థూలస్యసూక్ష్మ
స్యజడస్య భాగోదేహస్యశంభో నభిదంవినాస్తి॥
అతస్త్వదారోపణమాతనోతిశ్రుతిః పురారేసు
ఖదుఃఖయోస్తు॥ ౩౬॥

తా॥ భూమినిసృజింప పాలింప సంరక్షింప నీకుం బ్రయోజనంబులేదు
దేహధారులకెల్ల నెరుంగనేరని కార్యంబుల స్వప్నంబులుంబోలె నాచరిం
తువు స్థూలసూక్ష్మ జడాత్మకంబులైనదేహంబులకు నీకును భేదంబులేదు శ్రు
తులుసుఖదుఃఖంబుల కీవకారణుండవని వచించు.

శ్లో॥ నమఃసచ్చిదంభోధిహంసాయ తుభ్యంనమఃకా
లకంఠాయకాలాంతకాయ। నమస్తేసమస్తాఘ

సంహారకర్త్రే నమస్తేవృషాచిత్త వృత్త్యైకభో క్త్రే॥౩౭॥ ఏవంప్రణమ్యవిశ్వేశం పురతఃప్రాంజలిఃస్థితః। విస్మితఃపరమేశానం జగాదరఘునందనః॥౩౮॥ ఉపసంహారసర్వాత్మన్ విశ్వరూపమిదంతవ। ప్రతీతంజగదైకాత్మ్యం శంభోభవదనుగ్రహాత్॥ ౩౯॥

తా॥ఓదేవదేవా సచ్చిదానంద సముద్రంబున హంసరూపివై కాలకంఠుండవై కాలాంతకుండవై సమస్తపాపసంహర్తవై వెలుంగు నీకేనమస్కరించెదనని యనేకవిధంబుల శ్రీరాముండు నమస్కరింపుచు ప్రాంజలియై ఓ మహాత్మా నీవిశ్వరూపంబుపసంహరింపుము. నీవు జగదాత్మస్వరూపుండవని నీయనుగ్రహంబుచే నెరింగితినని శ్రీరాముఁడు పలుకుచుండ నీశుండు,

శ్రీ భగవానువాచ.

శ్లో॥ పశ్యరామమహాబాహో మత్తోనాన్యోస్తికశ్చన। ఇత్యుక్త్వోపసంజహ్రే స్వదేహే దేవతాదికాన్॥౪౦॥ మీలితాక్షఃపునర్హృష్టో దదృశేరామఃప్రపశ్యతి॥ తావదేవగిరేశ్శృంగే వ్యాఘ్రచర్మోపరిస్థితః॥౪౧॥ దదర్శపంచవదనం నీలకంఠంత్రిలోచనం। వ్యాఘ్రచర్మాంబరధరం భూతిభూషితవిగ్రహం॥౪౨॥ ఫణికంకణభూషాఢ్యం నాగయజ్ఞోపవీతినం। వ్యాఘ్రచర్మోత్తరీయంచ విద్యుత్పింగజటాధరం॥౪౩॥ ఏకాకినంచంద్రమౌళిం। వరేణ్యమభయప్రదం। చతుర్భుజంఖండపరశుం మృగహస్తంజగత్పతిం॥౪౪॥ తదాజ్ఞయా పురస్తస్య ప్రణమ్యోపవివేశసః॥౪౫॥ అథాహ రామందేవేశో యద్యత్ప్రష్టుమభీప్ససి। తత్సర్వంపృచ్ఛరామత్వం మత్తోనాన్యోస్తితేగురుః॥౪౬॥

తా॥ ఓరామచంద్రా నాకన్న వేఱద్దియునులేదు చూడుమని వచించి యాదేవతాది రూపంబులనణంచి రాముని కనులముందర పర్వతాగ్రంబున వ్యాఘ్రచర్మంబుమీదం గూర్చుండెనంత శ్రీరాముండు దేవదేవుండు పంచముఖుండును వ్యాఘ్రచర్మాంబరధారియు భూతి భూషితుండును ఫణికంకణధారియు మెఱుంగులంబోలు జడలధరించి యేకాకియై చంద్రమౌళియైయభయప్రదాతయై నాలుగు భుజంబులందాల్చి మృగహస్తుండై జగన్నాయకుండైన మహేశుంగాంచి ప్రణమిల్లి యాదేవునాజ్ఞచే గూర్చుండెనంత సదాశివుండా రాముంగాంచి ఓరాఘవా నీవేది యడుగంగోరెదవో దానినెల్ల నడుగుమని వచించెను.

ఇతి శ్రీపద్మపురాణే.

శ్రీమచ్ఛివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శివరాఘవసంవాదే—విశ్వరూపసంద
ర్శనయోగోనామ సప్తమోఽధ్యాయః.

ఇది పద్మపురాణంబున శ్రీకరంబై యుపనిషద్రూపమైనదియు
పరబ్రహ్మవిద్యయైనట్టి శివగీతలనెడు యోగశాస్త్రంబున
శివరాఘవ సంవాదరూపంబైన విశ్వరూపసందర్శన
యోగంబను ఏడవ యధ్యాయము ముగిసెను.

## అష్టోధ్యాయః.

శ్రీరామ ఉవాచ.

శ్లో॥ పాంచభౌతికదేహస్య చోత్పత్తిఃవిలయఃస్థితిః॥
స్వరూపంచకథందేవ భగవన్వక్తుమర్హసి॥ ౧॥

తా॥శ్రీరాముండు చెప్పుచున్నాడు ఓదేవదేవా పంచభూతాత్మకంబైన దేహంబెట్లగు నెట్లువృద్ధినొందు నెట్లునశించు దీని తెరంగెఱుంగింపుమని వేడిన.

శ్రీభగవానువాచ.

శ్లో॥ పంచభూతైస్సమారబ్ధో దేహోహ్యయం పాంచభౌతికః। తత్రప్రధానంపృథివీ శేషాణాం సహకారితా ॥౨॥ జరాయుజాండజాశ్చైవ స్వేదజాశ్చోద్భిదస్తథా। ఏవంచతుర్విధఃప్రోక్తో దేహోయంపాంచభౌతికః॥౩॥ మానసోపిపరఃప్రోక్తో దేవానామితితత్ స్మృతః। తత్రవక్ష్యేప్రథమతః ప్రధానత్వాజ్జరాయుజం॥౪॥ శుక్లశోణితసంభూతః। పిత్రోరేవజరాయుజః। స్త్రీణాంగర్భాశయేశుక్ల మృతుకాలేవిశేద్యదా॥౫॥రజసాయోషితోయుక్తం తదేవస్యాజ్జరాయుజం। బాహుళ్యాద్రజసఃస్త్రీస్యా చ్ఛుక్లాధిక్యేపుమాన్భవేత్॥౬॥ శుక్లశోణితయోస్సామ్యే జాయతేచనపుంసకః।ఋతుస్నాతాభవేన్నారీచతుర్థదివసే తతః।ఋతుకాలస్సనిర్దిష్టః ఆషోడశదినావధి॥౭॥

మహేశుండు చెప్పుచున్నాడు.

తా॥ఓరామాపంచభూతంబుల శరీరంబుగలుగు దానికిప్రధానంబు భూమియైయుండు నితర భూతంబులు సహకారంబులగు యీదేహంబులు జరా

యుజంబులు అండజంబులు స్వేదజంబులు ఉద్భిజంబులని నాలుగు విధంబు లుగానుండు మరియు దేవాదులకు మానసంబని యొకటికలదు. అందు మొద టిదియగు జరాయుజంబు నెరుంగించెద తల్లిదండ్రుల శుక్లశోణితంబులజరా యుజంబుగల్గు స్త్రీగర్భంబున ఋతుకాలంబున శుక్లంబు ప్రవేశించి స్త్రీర జంబునంగూడి జరాయుజంబగు రజంబధికంబైన స్త్రీయగు శుక్లం బధికంబైన పురుషుండు ఆరెండును సమంబైన నపుంసకుండగు స్త్రీలు నాలవ దినంబు ఋతుస్నానంబుజేయు నాకాలంబు పదియారుదినంబులవరకు ఋతుకాలం బనంబరగు.

శ్లో॥ తత్రాయుగ్మదినేస్త్రీస్యా త్పుమాన్యుగ్మదినేభ వేత్ ॥౮॥ షోడశేదివసేగర్భే జాయతేయదిసు భ్రువః। చక్రవర్తిమహాశ్రాజో జాయతేసనసం శయః॥౯॥ ఋతుస్నాతాయస్యపుంస స్సాకాం క్షంముఖమీక్షతే। తదాకృతిర్భవేద్గర్భ స్తత్ప శ్యేత్స్వామినోముఖం॥ ౧౦॥

తా॥ ఆ కాలంబున గర్భంబు గలిగిన సరిదినంబుల పురుషుండును బేసి దినంబుల స్త్రీయుం గలుగుచురు పదియారవ దినంబున గర్భంబుగలిగె నేనిచక్రవర్తియగు పురుషుండుపుట్టునిది నిశ్చయంబు ఋతుస్నాతయైనవనిత తన మగని మొగంబును సానురాగయై వీక్షించెనేని తదాకృతిగల బా లుండుపుట్టు.

శ్లో॥ యాస్తిచర్మావృతిస్సాత్మా జరాయుస్సాని గద్య తే। శుక్లశోణితయోర్యోగ స్తస్మిన్నేవ భవే ద్యతః ॥౧౧॥ తత్రగర్భోభవేద్యస్మా ద్యేనప్రో క్తాజరాయుజః। అండజాఃపక్షిసర్పాద్యాస్స్వే దజామశకాదయః ॥౧౨॥ ఉద్భిజా వృక్షగుల్మా ద్యా మానసాశ్చసురర్షయః॥ జన్మకర్మ వశా దేవ నిషిక్తంస్వరమందిరే॥ ౧౩॥

తా॥ అస్థిచర్మరూపంబైన గర్భంబు జరాయుజంబు పక్షిసర్పాదు లండజంబులుమశకాదులు స్వేదజంబులు వృక్షగుల్మలతాదులు ఉద్భిజంబులు సురమునులు మానసంబులు అనంబరగు వారివారి కర్మాధీనులై సకలయోనులంబుట్టుదురు.

శ్లో॥ శుక్లంరజస్సమాయుక్తం ప్రథమేమాసితద్ద్రవం॥
బుద్బుదంకలలంతస్మాత్తత్తుపేశీభవేదిదం॥ ౧౪॥
పేశీఘనంద్వితీయేతు మాసేపిండఃప్రజాయతే।
కరాంఘ్రిశీర్షాద్యంగానితృతీయేసంభవంతిహి॥
౧౫॥అభివ్యక్తిశ్చజీవశ్చచతుర్థేమాసిజాయతే
తతశ్చలతిగర్భోపిజనన్యాజఠరేస్వతః॥౧౬॥ పు
త్రశ్చేద్దక్షిణేపార్శ్వేకన్యావామేచతిష్ఠతి॥౧౭॥

తా॥ ఆశుక్లంబు ప్రథమమాసంబున బుద్బుదంబు కలలంబై పేశీరూపంబగు రెండవమాసంబుననా పేశీ ఘనంబై పిండంబుగానగు మూడవమాసంబున చేతులు కాళ్లు శిరంబు మొదలగు నంగంబులేర్పడు నాలవమాసంబున వ్యక్తిగల జీవుండై గర్భంబున గదలుచుండు పురుషుండు దక్షిణ భాగంబునందును స్త్రీవామ భాగంబందును గదలుచుండు.

శ్లో॥ నపుంసకస్తూదరస్య భాగేతిష్ఠతిమధ్యమే ॥౧౮॥
అతోదక్షిణపార్శ్వేతు మాతుశ్శేతేపుమానపి
అంగప్రత్యంగభాగాశ్చ సూక్ష్మాస్స్యుర్యుగపత్త
దా ॥౧౯॥ విహాయశ్మశ్రుదంతాదీన్ జన్మానంత
రసంభవాన్। ఏషాప్రకృతిరస్యాతు వికృతిస్సమ్మ
తామతా ॥౨౦॥ చతుర్థేవ్యక్తతాతేషాంభావా
నామపిజాయతే॥

తా॥ నపుంసకుడు వుదరమధ్య భాగంబున చరించు కావున తల్లి గర్భంబున దక్షిణభాగంబున పురుషుండుండు అంగ ప్రత్యంగంబులు సూక్ష్మంబులుగానగు మీసంబులు దంతాదులు ప్రకృతి వికృతులు గలుగు నాలవమాసంబున వ్యక్తంబులుగానగు.

శ్లో॥ పుంసాం శౌర్యాదయో భావా భీరుత్వాద్యాస్తు యోషితాం ॥౨౦॥ నపుంసకేతు తేమిశ్రాభవం తి రఘునందన ॥౨౧॥ మాతృజంవాస్యహృదయం విషయానభికాంక్షతే । అతోమాతుర్మనోభీష్టం కుర్యాద్గర్భవివృద్ధయే ॥౨౧॥ తాం చద్విహృదయాంనారీ మాహుర్దౌహృదినీంతతః ॥౨౨॥ అదానాద్దోషదాశ్చస్యుర్గర్భస్యవ్యంగతాదయః ॥౨౩॥ మాతుర్యద్విషయాలాభస్తదార్తోజాయతేసుతః॥ ౨౩॥

తా॥ పురుషులకు శౌర్యాదులు స్త్రీలకు భీరుత్వంబులు నపుంసకులకు మిశ్రంబులు గలుగు గర్భస్థునకు తల్లి హృదయంబు గలుగుగాన గర్భవృద్ధికై తల్లి కోరినవాని నివ్వవలయు దానిచేగర్భిణిద్వి హృదయనంబరగు గర్భిణి గోరినవాని నివ్వకున్న గర్భంబునకు అంగవైకల్యాది దోషంబులగు మరియు ను గర్భస్థుండార్తినొందు.

శ్లో॥ ప్రబుద్ధంపంచమేచిత్తం మాంసశోణితపుష్టతా। షష్ఠేస్థిస్నాయునఖర కేశలోమవివిక్తతా॥౨౪॥ బలవర్ణౌచోపచీతౌ సప్తమేత్వంగపూర్ణతా । పాదాంతరితహస్తాభ్యాం. శ్రోత్రరంధ్రేపిధాయసః॥ ౨౫॥ ఉద్విగ్నోగర్భసంవాసాదాస్తే గర్భభయాన్వితః । ఆవిర్భూతప్రబోధోసౌ గర్భదుఃఖాది సంయుతః ॥౨౬॥ హాకష్టమితినిర్విణ్ణః స్వాత్మానంశోచతీత్యథః । అనుభూతామయాసహ్యా పూర్వమర్మభిదాసకృత్ ॥౨౭॥ కరంభవాలుకాస్తప్తా యాదహ్యంత్యసుఖాదయః । జఠరానలసంతప్త పిత్తాఖ్యరసవిప్రుషః ॥౨౮॥ గర్భాశయేనిమగ్నంతు దహంత్యతిభృశంతుమాం।

ఔదర్య క్రిమివక్త్రాణి కూటశాల్మలి కంటకైః ॥౨౯॥ తుల్యానిచతుదంత్యార్తం పార్శ్వాస్థిక్రకచార్దితం॥౨౯౹॥ గర్భేదుర్గంధభూయిష్ఠేజఠరాగ్నిప్రదీపితే। దుఃఖంమయాప్తంయత్తస్మాత్కనీయంకుభపాకజం॥౩౦॥ పూయాసృక్ శ్లేష్మపాయిత్వం వాతాశిత్వంచయద్భవేత్ । అశుచౌక్రిమిభావశ్చతత్ప్రాప్తంగర్భశాయినాం ॥౩౦౹॥ గర్భశయ్యాంసమారుహ్య దుఃఖంయాదృఙ్మయాపితత్। నాతిశేతేమహద్దుఃఖం నిశ్శేషంనరకేషుయత్॥ ౩౧౹॥

తా॥ ఆయిదవనెల శరీరంబున మాంసశోణితంబులు గల్గు నారవమాసంబందు యెముకలు, గోళ్లు, వెండ్రుకలు గలుగు బలవర్ణంబులుం గలుగు ఏడవమాసంబున సకలాంగంబుల వృద్ధినొందు గర్భస్థుండు తెలివిగల్గి గర్భవాస భయాతురుండై దుఖంబంది నిర్వీణుండై అయ్యయో నాకిట్టి కష్టంబబ్బె నేపూర్వకర్మంబుల ననేకనరకదుఃఖంబులం బొందితి నిప్పుడు జఠరాగ్ని నన్నుంగాల్చుచున్నది వాతపిత్తాదులు బాధించెడు క్రిమికీటాదులు కూటశాల్మలికంటకాదులుంబోలె నన్నుం బాధించుచున్నది పార్శ్వంబులనస్థులు కత్తులుంబోలెనున్నవి యీగర్భంబు దుర్గంధంబైయున్నది జఠరాగ్ని కుంభీపాకంబుంబోలే దహించుచున్నది పూయంబును వాయువును పానంబుజేయవలనే యీగర్భవాసంబు అశుచికరంబయ్యె యీదుఃఖంబులెల్ల నరకబాధలకన్న నధికంబుగానున్నది నేనేమిసేతు.

శ్లో॥ ఏవంస్మరన్పురాప్రాప్తానానాజాతీశ్చయాతనాః। మోక్షోపాయమభిధ్యాయన్ వర్తతేభ్యాసతత్పరః ॥ ౩౩౹ ॥ అష్టమేత్వక్ స్మృతీస్యాతా మోజస్తేజశ్చహృద్భవం ॥౩౪॥ శుద్ధమాపీతరక్తంచ నిమిత్తంజీవితేమతం । మాతురంతః పునర్గర్భేచంచలంతత్ప్రధావతి ॥౩౫॥ అతోజంతోష్ట

మేమాసినజీవత్యోజసోఖితః । కంజతాకాల
మవస్థానం! సంస్కారాత్ఖండితాంగవత్ ॥౩౬॥

తా॥ అని యనేకవిధంబుల తాబడిన యమబాధలం దలంచుచు మోక్షో పాయంబెట్లు గల్గునని యెంచుచుండు ఎనిమిదవమాసంబున చర్మంబునొంద ముదాహంబు ఓజంబును తేజంబునుంగలుగు పరిశుద్ధంబు పీతంబు రక్తంబునై జీవితంబుండు అప్పుడు తల్లిగర్భంబందుండి తేజోహీనంబై బయలు వెడలె నేని నాశిశువు కొంత కాలంబుండక ఖండితాంగంబైనశించు.

శ్లో॥ సమయఃప్రసవస్యాస్యా స్మాసేషునవమాదిషు ।
మాతురస్రవహాంనాడీ మాశ్రిత్యా నవతారి
తాః ॥౩౭॥ నాభిస్థనాడీగర్భస్య మాత్రాహార
రసావహా । తేనజీవతిగర్భోపి మాత్రాహారేణ
పోషితః॥ ౩౮॥

తా॥ ప్రసవంబునకు తొమ్మిదవ మాసంబు మొదలు కాలంబు తల్లి యస్రవహంబై నాడింబొంది గర్భస్థనాడి మాత్రాహారంబున వృద్ధినొందుచుండు దానిచే గర్భంబు తల్లి యాహారంబున పోషితంబగు.

శ్లో॥ అస్థియంత్రాద్వినిస్పృష్టః పతితఃకుక్షివర్త్మనా ।
మేదోసృగ్దిగ్ధసర్వాంగో జరాయుపుటసంవృతః॥
౩౯॥ నిష్క్రామన్భృశదుఃఖార్తో రుదన్నుచ్చై
రధోముఖః । యంత్రాదివవినిర్ముక్తః పతత్యు
త్తానశాయ్యధః ॥౪౦॥ అకించిత స్తదాబాలో
మాంసపేశీతథాస్థితః । శ్వమార్జాలాదిదం
ష్ట్రిభ్యో రక్ష్యతేదండపాణిభిః॥ ౪౧॥

తా॥ పిమ్మట నాగర్భంబు అస్థియంత్రంబువలనం జారికుక్షి మార్గంబున పతితంబై మెదడు నెత్తురు శరీరంబెల్ల నావరింప జరాయు పుటంబుతో గూడి బయలువెడలి దుఃఖంబున నధోముఖంబై విలపించుచు యంత్రంబువలె నంబోలె నిర్ముక్తంబై యుత్తానశాయియై నేలంబడు అప్పుడాశిశువు మాం

పేశిరైయి కుక్కలు పిల్లులు మొదలైనవానివలన భయంబునొందక దండధారులచే రక్షింపంబడు.

శ్లో॥ పితృవద్రాక్షసంవేత్తి మాతృవడ్ఢాకినీమపి॥ పూయంపయోవదజ్ఞానః దీర్ఘకష్టంతుశైశవం॥౮౨॥ శ్లేష్మణాపిహితానాడీ సుషుమ్నాయావదేవతు। వ్యక్తవర్ణంచ వచనంతావద్వక్తుంనశక్యతే॥౮౩॥ అతఏవచగర్భేపిరోదితుంనైవశక్నుతే॥ ౮౩॥

తా॥ ఆశిశువు రాక్షసుని తండ్రివలెను ఢాకినీభూతంబును తల్లివలెను పూయంబునుపాలుంబోలెను దలంచుంగాన శైశవంబతికష్టంబు సుషుమ్నానాడి శ్లేష్మంబుతోఁ గూడియుండువరకు శిశువు వ్యక్తంబుగా పలుకంజాలడు కాన గర్భంబుననుండువరకు శిశువు రోదనంబుఁ జేయంజాలడు.

శ్లో॥ దృప్తోథయావనంప్రాప్య మన్మథజ్వరవిహ్వలః। గాయత్యకస్మాదుచ్చైస్తు తథాకస్మాచ్చవల్గతి ॥ ౮౪॥ ఆరోహతితరూన్వేగా చ్ఛాంతానుద్వేజయత్యపి॥ కామక్రోధమదాంధస్సన్నకించిదపివీక్షతే ॥౮౫॥ అస్థిమాంసనికాయాయారామాయామన్మథాలయే। ఉత్తానపూతిమండూకపాటితోదరసన్నిభే॥ ౮౬ ॥ ఆసక్తస్స్మరబాణార్త ఆత్మనాదహ్యతేభృశం । అస్థిమాంససిరాసృగ్భ్యః కిమన్యద్వర్తతేవపుః॥ ౮౭॥ రామమన్మాయయామూఢో నకించిద్వీక్షతేజగత్ । నిర్గతేప్రాణపవనే దేహీహంతమృగీదృశః॥ ౮౮॥ యథాహిజ్ఞాయతేనైవ వీక్ష్యతేపాంచభౌతికః॥ ౮౯॥

తా॥ పిమ్మట నాబాలుండు యౌవ్వనంబునసుండి మన్మథజ్వరపీడితుండై మదించి అకస్మాత్తుగా గానంబుచేయు అట్లవల్గనంబునుంజేయు మరియు వృక్షంబుల నతివేగంబున నెక్కుశాంతులం దిరస్కరించు కామక్రోధమదాం

ధుండై యేదియునెరుంగనేరక అస్థిమాంసనిలయంబైన స్త్రీల మన్మథాలయం బుపై నాశ_క్తినొంది మన్మథబాణార్దితుండై దహింపంబడు యీశరీరంబెల్ల మాంసనిరాసృక్సహితంబు మూఢుండు నామాయచే మోహితుండై యేది యు నెఱుంగండు ప్రాణంబులు వోయిన వెనక మోహంబుగలస్త్రీలం జూడ నేరండు యీదేహంబు పాంచభౌతికంబు.

శ్లో॥ మహాపరిభవస్థానం జరాం ప్రాప్యాతిదుఃఖితః ।
శ్లేష్మణాపిహితోరస్కో జగ్ధమన్నం నజీర్యతే॥౧౦॥
సన్నకంఠో మందదృష్టిః కటుతిక్తకషాయభుక్
వాతభుగ్నకటిగ్రీవ కరోరూచరణోబలః॥ ౧౧॥
గదాయుతసమావిష్టః పరిభూతస్స్వబంధుభిః ।
నిశ్శౌచో మలదగ్ధాంగ ఆలింగితపరోషితః॥౧౨॥
ధ్యాయన్ సులభాన్ భక్ష్యాన్ కేవలం వర్తతే
చలః । సర్వేంద్రియక్రియాలోపా ద్ధస్యతే బాల
కైరపి॥ ౧౩॥ తతో పి జరదుఃఖస్య దృష్టాంతో నో
పలభ్యతే యస్మాద్విభ్యతి భూతాని ప్రాప్తాన్యపిప
రాం రుజం॥ ౧౪॥

తా॥ పిమ్మట నరుండు పరిభవాస్పదంబైన జరంబొంది దుఃఖితుండై శ్లేష్మనాడి యుదరంబావరింప అన్నంబు జీర్ణంబుగాక సన్నకంఠుండు మంద దృష్టియునై కటుకషాయాదుల భుజించుచు శరీరంబెల్ల వాతంబావరింప బ లంబులేక ననేకరోగంబులంగూడి బంధువులు తిరస్కరింప అశుచియు మలి నుండై భూమింబవళించుచు మృదుభక్ష్యంబులంగోరుచు అచలుండై సర్వేం ద్రియకార్యంబుల మాని బాలులచేతనుం బీడింపంబడుచుండుగాన ముసలిత నంబుకన్న దుఃఖంబులేదు. భూతంబులెల్లను జరంగాంచి భయంబందు.

శ్లో॥ నీయ్యతే మృత్యునా జంతుః పరిష్వ_క్తోపి బంధుభిః ।
సాగరాంతర్జలగతో గరుడేనేవ పన్నగః॥ ౧౫॥
హాకాంతే హా ధనం పుత్రాః క్రందమానస్సుదా
రుణం । మండూక ఇవ సర్పేణ మృత్యునానీయతే

నరః॥ ౪౬॥ మర్మసూత్కృష్యమాణేషు ముచ్యమానేషుబంధుషు । యద్దుఃఖంమ్రియమాణస్య స్మర్యతాంతస్తుముక్షుభిః॥ ౪౭॥ దృష్ట్వావాక్షిప్యమాణస్య సంజ్ఞయాక్రీయమాణయా। మృత్యుపాశేనబద్ధస్య పుత్రాద్యైర్నోపలభ్యతే॥ ౪౮॥

తా॥ నరుండు కాలంబువచ్చిన బంధుపరివృతుండైయున్నను సాగరజలంబులననంగియున్న పామును గరుడుండునుంబోలె మృత్యుగృహీతుండగు అప్పుడాతండు ఓకాంతా ఓధనంబా ఓసుతులారా యని యనేకవిధంబుల దుఃఖించుచు సర్పంబుచే గ్రహింపంబడిన కప్పయుంబోలె మృత్యుగ్రస్తుండై యమపాశంబులు మర్మంబులు భేదింప బంధువులు దన్ను విడువ యెట్టికష్టం బనుభవించునో అట్టిదాని ముముక్షువులుస్మరింపందగు మృత్యుపాశబద్ధుండై సాజ్ఞలేకనుండువాని పుత్రాదులు రక్షింపంజాలరు.

శ్లో॥ సంరుధ్యమాన స్తమసామహాశ్వభ్రమివావిశత్ ।
ఉరోఘ్నత స్తదాజ్ఞాతీ నీక్ష తేదీనచక్షుషా॥ ౪౯॥
యమపాశేనకాలేన స్నేహపాశేనబంధుభిః। ఆ
త్మానంకృష్యమాణంతమీక్ష తేపరిత స్తథా॥౫౦॥
హిక్కయాబాధ్యమానస్యశ్వాసేన పరితప్యతః।
మృత్యునాకృష్యమాణస్య నఖల్వ స్తి పరాయణః॥
౫౧॥ సంసారయంత్రమారూఢో యమదూతై
రధిష్ఠితః । క్వయాస్యామీతిదుఃఖార్తః కాల
పాశేనయోజితః॥ ౫౨॥ కింకరోమిక్వగచ్ఛామి।
కింగృహ్ణామిత్యజామికిం । ఇతికర్తవ్యతామూఢః
కృచ్ఛ్రాద్దేహాత్యజత్యసూన్॥ ౫౩ ॥ యాతనా
దేహసంబంధో యమదూతైరధిష్ఠితః। ఇతోగ
త్వానుబధ్నంతి యాయాస్తాయమయాతనాః॥
౫౪॥ యాసుయల్లభ్యతేదుఃఖం తద్వక్తుం నసహ
తేతుకః॥ ౫౫॥

తా॥ నరుండంధకారంబున కనులెరుంగక మహాశ్వభ్రంబునంబడురీతిం బోవుచు రొమ్మురొమ్మునం గొట్టుకొనుచున్న తమవారల దీనుండై చూచుచు యమపాశంబుచేతను కాలంబుచేతను స్నేహపాశంబుచేతనుబంధువులచేతను కృష్యమాణుండై హిక్కాబాధితుండై శ్వాసంబుచే తపించుచు మృత్యుగ్రస్తుండగువాని కెవ్వరు నడ్డపడువారులేరు సంసారయంత్రంబెక్కి యమదూతలచే పీడ్యంబడుచు దుఃఖార్తుండై కాలపాశబద్ధుండై నేనేమిచేతునింక నెచటికింబోదు దేనిగ్రహింతు దేనివిడుతునని కర్తవ్యాకర్తవ్యంబు లెఱుంగక యతికష్టంబున ప్రాణంబులవిడిచి యాతనాశరీరంబునొంది యమదూతలచే బాధింపంబడుచు బహుబాధలం బొందుదాని నెరుంగింప నెవ్వండును జాలడు.

శ్లో॥ కర్పూరచందనాద్యైస్తు లిప్యతే సతతం హియత్ ।
భూషణైర్భూష్యతే చిత్రైః సువస్త్రైః పరిధార్యతే॥ ౬౬॥ అస్పృశ్యం జాయతే ప్రేక్ష్యం జీవత్యక్తం తదావపుః ॥౬౭॥ నిష్కాసయంతి నిలయాత్ క్షణం న స్థాపయంత్యపి । దహ్యతే తైస్తతః కాష్ఠైస్తద్భస్మీక్రియతే క్షణాత్ ॥౬౮॥ భక్ష్యతే వాసృగాలైశ్చ గృధ్రకుక్కుటవాయసైః । పునర్న దృశ్యతే సోఽపి కోటిజన్మశతైరపి॥ ౬౯॥

తా॥ కర్పూరచందనాదుల నలందుకొని సకలభూషణాలంకృతంబై సువస్త్రంబులధరించియున్న శరీరంబు జీవంబువాసినవెనుక అస్పృశ్యంబప్రేక్ష్యంబగు పిమ్మట నాశరీరంబును క్షణంబైననింటనుంచక తక్షణంబె కాష్ఠంబులదహింతురు. అట్లుగాకున్న నక్కలు గృధ్రంబులు వాయసంబు మొదలైనవిదిను ఆనరుండు కోటిజన్మంబులకైన మరలగానంబడడు.

శ్లో॥ మాతాపితాగురుజన స్స్వజనోమమేతి । మాయోపమేజగతికస్యభవేత్ప్రతిజ్ఞా । ఏకోయదా వ్రజతికర్మపురస్సరోఽయం విశ్రామవృక్షసదృశః ఖలుజీవలోకః॥ ౭౦॥ సాయంసాయం వాసవృ

క్షం విహంగాస్తద్వత్తద్వత్ జ్ఞాతయోజ్ఞాతయ
శ్చ ॥౭౦౫॥ మృతిబీజంభవేజ్జన్మ జన్మబీజంభవే
న్మృతిః । యోనియంత్రపథభ్రాంతో బభ్రామ
త్యనిశంనరః॥ ౭౧౫॥ గర్భేప్యనశ్శుక్లపాతాద్య
దుక్తంమరణావధి । తదేతస్యామహావ్యాధేర్మ
త్తోనాన్యోస్తిభేషజం॥ ౭౨౫॥

తా॥ నాతల్లి నాతండ్రి నాగురుండు నాబంధువులని మాయాబద్ధుండై తలంచువాడు జీవంబువిడిచిన వెనక వారినెల్లంబాసి యేకాకియై స్వకర్మపురస్సరుండైయరుగు. జీవలోకంబెల్ల విశ్రామవృక్షచ్ఛాయనుండువానికిం దుల్యంబు ప్రతిసాయంకాలంబు వృక్షంబులు జేరు పక్షులంబోలె సకలజనులొకరొకరిం జేరుచుం బాయుచుందురు. చావునకు బీజంబుజన్మంబు జన్మంబునకు మృతియేబీజంబగు నరుండు యోనియంత్రపథ భ్రాంతుండై దిరిగితిరిగి మరల గర్భంబునంబడి మరణావధిగానుండు యీసంసార మహావ్యాధికి నన్నువిడిచిన మరియొకయౌషధంబులేదని శివుండు రామునకెరింగించెను.

ఇతి శ్రీపద్మపురాణే.

శ్రీమచ్ఛివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శివరాఘవసంవాదే—గర్భోత్పత్త్యాది
కథనం నామాష్టమోధ్యాయః.

ఇది పద్మపురాణంబున శ్రీకరంబై యుపనిషద్రూపమైనదియు
పరబ్రహ్మవిద్యయైనట్టి శివగీతలనెడు యోగశాస్త్రంబున
శివరాఘవ సంవాదరూపంబై గర్భోత్పత్త్యాదికథనం
బను ఎనిమిదవ యధ్యాయము ముగిసెను.

# నవమోధ్యాయః.

శ్రీ భగవానువాచ.

శ్లో॥ దేహస్వరూపంవక్ష్యామిశృణుష్వావహితోనృప। మత్తోహిజాయతే విశ్వంమయ్యైవైతత్ప్రధార్యతే॥ మయ్యేవేదమధిష్ఠానే లీయతేశుక్తిరాప్యవత్॥ ౧॥ అహంతునిర్మలఃపూర్ణ స్సచ్చిదానందవిగ్రహః। అసంగోనిరహంకార శ్శుద్ధబ్రహ్మసనాతనః ॥౨॥ అనాద్యవిద్యయాయుక్తో జగత్కారణతాంవ్రజె ॥౩॥ అనిర్వాచ్యామహావిద్యాత్రిగుణాపరిణామినీ॥

మహాదేవుండు చెప్పుచున్నాఁడు.

తా॥ ఓ రామచంద్రా పరాకులేకవినుము నేనీవిశ్వంబును సృజించి రక్షించి నాశంబుజేయుచుందు ఇది శుక్తియందు రజతంబునుంబోలె నాయందునుండు నేనిర్మలుండ పరిపూర్ణుండ సచ్చిదానంద స్వరూపుండ అసంగుండ అనహంకారుండ శుద్ధబ్రహ్మరూపుండ సనాతనుండనై అనాద్యవిద్యాయుక్తుండనై జగత్కారణుండనైయుందు నాశక్తి అనిర్వాచ్యమై త్రిగుణాత్మకంబైయుండు.

శ్లో॥ రజస్సత్వంతమశ్చేతి తద్గుణాఃపరికీర్తితాః ॥౪॥ సత్యంశుక్లం సమాదిష్టం సుఖంజ్ఞానాస్పదంనృణాం। దుఃఖాస్పదంరక్తవర్ణం చంచలంహిరజోమతం ॥౫॥ తమఃకృష్ణంజడంప్రోక్త ముదాసీనం సుఖాదిషు। అతోమమసమాయోగా చ్ఛక్తిస్సాత్రిగుణాత్మికా ॥౬॥ అధిష్ఠానేతుమయ్యేవ భజతేవిశ్వరూపతాం। శుక్తౌరజతవద్రజ్జౌభుజం

గోయద్వదేవతు ॥౭॥ ఆకాశాదీనిజాయంతే మ
త్తోభూతానిమాయయా॥ తైరారబ్ధమిదంసర్వం
దేహోహాయంపాంచభౌతికః॥ ౮॥

తా॥ సత్వంబు, రజంబు, తమంబని మూడుగుణంబులుగలవు అందు స
త్వంబు శుక్లంబై జనంబులకు సుఖజ్ఞానాస్పదంబైయుండు రజంబురక్తవర్ణం
బుగల్గి దుఃఖాస్పదంబైయుండు తమంబు కృష్ణవర్ణంబై జడంబై యుదాసీ
నంబైయుండు యీగుణంబులతోగూడి నాశక్తి త్రిగుణాత్మకంబైయుండు.
శుక్తియందు రజతంబునుంబోలె రజ్జువందు సర్పభ్రాంతిచందంబునసకలభూ
తంబులు నాయందధిష్ఠానంబై మాయచేజనించు నాపంచభూతంబులవలన స
కలదేహంబులు గలుగు.

శ్లో॥ పితృభ్యామశ్నితాదన్నాత్ షట్కోశంజాయతే
వపుః । స్నాయురస్థిచమజ్జాచ జాయంతేపితృత
స్తథా ॥౯॥ త్వఙ్మాంసంశోణితమితి మాతృతశ్చ
భవంతిహి॥

తా॥ తల్లిదండ్రులుభుజించిన యన్నంబుచే శరీరంబువృద్ధినొందు, స్నా
యువు, అస్థులు, మెదడు నివి పితృజంబులు త్వఙ్మాంసశోణితంబులు మా
తృజంబులగు.

శ్లో॥ భావాస్స్యుష్షడ్విధాస్తస్య మాతృజాఃపితృజాస్త
థా ॥౧౦॥ మృదవశ్శోణితంమేదోమజ్జాప్లీహాయ
కృద్గుదః । హృన్నాభీత్యేవమాద్యాస్తు భావా
మాతృభవామతాః ॥౧౧॥ శ్మశ్రులోమకచస్నా
యు సిరాధమనయోనఖాః । దశనాశ్శుక్లమి
త్యాది స్థితాఃపితృసముద్భవాః॥ ౧౨॥

తా॥ ఇట్లారువిధంబులుగా భావంబులు మాతృపితృజన్యంబులై వెలయు
మృదుత్వంబు శోణితంబు మేదంబు మజ్జాప్లీహలు గుదంబు మనంబు నాభి
యు. ఇవి మాతృజంబులు శ్మశ్రులోమంబులు కచస్నాయువులు సిరాధమ
నులు నఖంబులు దశనంబులు శుక్లంబివి పితృసంభవంబులు.

శ్లో॥ శరీరోపచయోవర్ణోవృద్ధి స్తృప్తిర్బలంస్థితిః। అలో
లుపత్వముత్సాహ ఇత్యాదీన్ రసజాన్ విదుః॥౧౩॥

తా॥ శరీరవర్ణంబు వృద్ధియు, తృప్తియు, బలంబు, స్థితియు అలోలు
పత్వంబుత్సాహంబు ఇవి రసజంబులు.

శ్లో॥ ఇచ్ఛాద్వేషస్సుఖందుఃఖం ధర్మాధర్మౌచభావనా।
ప్రయత్నోజ్ఞానమాయుశ్చ ఇంద్రియాణ్యాత్మ
జామతాః॥ ౧౪ ॥ జ్ఞానేంద్రియాణిశ్రవణం దర్శ
నంస్పర్శనంతథాః । రసనంఘ్రాణమిత్యాహుః
పంచతేషాంచగోచరాః ॥౧౫॥ శబ్దస్స్పర్శ స్తథా
రూపం రసోగంధఇతిక్రమాత్। వాక్కరాంఘ్రి
గుదోపస్థా నాహుఃకర్మేంద్రియాణితు ॥౧౬॥
వచనాదానగమననిసర్గరతయఃక్రమాత్॥౧౭॥
క్రియాస్తేషాంమనోబుద్ధి రహంకార స్తతఃపరం॥
౧౮॥ అంతఃకరణమిత్యాహు శ్చిత్తంచేతిచతుష్ట
యం । సుఖందుఃఖంచవిషయో విజ్ఞేయామన
సఃక్రియాః॥ ౧౯॥

తా॥ ఇచ్ఛాద్వేషంబులు సుఖదుఃఖంబులు ప్రయత్నంబు తెలివి ఆయు
వు ఇంద్రియంబులివి ఆత్మసంభవంబులు శ్రవణదర్శన స్పర్శన రసనఘ్రాణం
బు లైదు జ్ఞానేంద్రియంబులు శబ్దస్పర్శరూపరసగంధంబులు వానిగుణంబులు
వాక్కు, కరంబు, పాదంబు, గుదంబు, ఉపస్థయు ఇవియైదును కర్మేంద్రి
యంబులు మాటలాడుట గ్రహించుట నడుచుట విసర్జించుట రతిచేయుట
యివి వానిగుణంబులు మనోబుద్ధ్యహంకార చిత్తంబులు నాలుగును అంతఃక
రణచతుష్టయంబు అందు సుఖదుఃఖంబులు విషయేచ్ఛయు మనఃక్రియలుగా
నందు.

శ్లో॥ స్మృతిర్భీతిర్వికల్పాద్యా బుద్ధిస్స్యాన్నిశ్చయా
త్మికా । అహంమమేత్యహంకార శ్చిత్తంచేత

యతేయతః ॥౧౯॥ సత్వాఖ్యమంతఃకరణం గుణ
భేదాస్తథామతాః । సత్వంరజస్తమఇతిగుణాస్స
త్యాత్తుసాత్వికాః ॥ ౨౦ ॥ ఆస్తిక్యశుద్ధధర్మైక
శుచిప్రకృతయోమతాః॥

తా॥ స్మృతియు, భయంబును, వికల్పాదులు, బుద్ధిజన్యంబులు, చిత్త
జాతం బహంకారంబు. అంతఃకరణంబువలన సత్వరజస్తమాదిగుణంబులుఁగలు
గు, అందు సత్వంబున సాత్వికంబాస్తికంబు శుద్ధియు ధర్మప్రకృతియుం
గలుగును.

శ్లో॥ రజసోరాజసాభావాః కామక్రోధమదాదయః॥
౨౧॥ నిద్రాలస్యప్రమాదాది వంచనాద్యాస్తుతా
మసాః । ప్రసన్నేంద్రియతారోగ్యా నాలస్యా
ద్యాస్తుమోహజాః ॥౨౨॥ దేహోభూతాత్మ
కస్తస్మా దాదత్తేతద్గుణానిమాన్ । శబ్దంశ్రోత్రం
ముఖరతాం వైచిత్ర్యంసూక్ష్మతాధృతాః ॥౨౩॥
బలంచగగనాద్వాయుః స్పర్శంచస్పార్శనేంద్రి
యః । ఉత్క్షేపణమపక్షేపా కుంచనేగమనం
తథా ॥౨౪॥ ప్రసారణమితీమాని పంచకర్మాణి
సూక్ష్మతాం॥

తా॥ రజోగుణంబువలన రాజసభావంబును కామక్రోధాదులుం గలుగు
నిద్రాలస్యతంద్రాదులు తామససంభవంబులు ఇట్లు దేహంబు పంచభూతాత్మ
కంబుగాన వానిగుణంబులంబొందు శ్రోత్రంబు శబ్దంబును సూక్ష్మత వైచి
త్ర్యంబును వాయువు బలంబును స్పర్శంబు స్పార్శనంబును ఉత్క్షేపణ
కుంచనాకుంచనాదుల ప్రసారణంబునుంజేయు.

శ్లో॥ ప్రాణాపానౌతథావ్యాన సమానోదానసంజ్ఞి
కాన్ ॥౨౫॥ నాగంచకూర్మంకృకరం దేవదత్తం

ధనంజయం । దశేతివాయువికృతి స్తథాగృష్ణో
తిలాఘవం ॥౨౬॥ తేషాంముఖ్యతమఃప్రాణో
నాభేఃకంఠాదవస్థితః । చరత్యాస్యేనాసికయో
ర్నాభౌహృదయపంకజే ॥౨౭॥ శబ్దోచ్చారణని
శ్వాసోచ్ఛ్వాసాదేరపికారణం॥ ౨౮॥

తా॥ ప్రాణంబపానంబు వ్యానంబు సమానంబు ఉదానంబు నాగకూర్మకృకరంబులుదేవదత్తధనంజయంబులనిదశవాయువులుగలవు వానియందు ప్రాణవాయువు ముఖ్యంబుగానుండు అది నాభికంఠ మధ్యమందుండి ముఖ నాసికలనాభిని హృదయపంకజంబునం దిరుగును శబ్దోచ్ఛ్వాస నిశ్వాసంబులకు కారణంబైయుండు.

శ్లో॥ అపానస్తుగుదేమేఢ్రే కటిజంఘోదరేష్వపి । నా
భౌకంఠేవృషణయోరూరుజానూనితిష్ఠతి॥౨౯॥
తస్యమూత్రపురీషాది విసర్గఃకర్మకీర్తితం ॥౨౯॥

తా॥ అపానంబు గుదంబున మేఢ్రంబున కటిజంఘల నుదరంబుననాభిని కంఠంబున వృషణంబుల నూరువులనుండి మూత్రపురీషాదుల విడుచుచుండు,

శ్లో॥ వ్యానోక్షిశ్రోత్రగుల్ఫేషు జంఘాఘ్రాణేచతిష్ఠతి।
ప్రాణాపానధృతిత్యాగ గ్రహణాద్యస్యకర్మచ॥౩౦॥

తా॥ వ్యానంబుచెవుల గుల్ఫంబునందొడల ఘ్రాణంబులనుండిప్రాణాపానధృతు లత్యాగగ్రహణంబులం జేయుచుండు,

శ్లో॥ సమానోవ్యాప్యనిఖిలం శరీరంవహ్నినాసహ ।
ద్వాసప్తతిసహస్రేషు నాడీరంధ్రేషుసంచరన్ ॥
౩౧॥ భుక్తపీతరసాన్సమ్య గానయన్దేహపుష్టి
కృత్ ।

తా॥ సమానంబు జఠరాగ్నితోఁగూడి దేహంబెల్ల వ్యాపించి డెబ్బదిరెండువేల నాడీరంధ్రంబులందిరుగుచు భుజించిన పీతరసంబుల దేహపుష్టిం గావించుచుండు,

శ్లో॥ ఉదానఃపాదయోరాస్తే హస్తయోరంగసంధిషు॥
౩౨॥ కర్మాస్యదేహో న్నమనోత్క్రమణాదిప్ర
కీర్తితం॥ ౩౨॥

తా॥ ఉదానంబు పాదంబుల హస్తంబుల శరీరరంధ్రంబులనుండి దేహంబునఉన్న మనోత్క్రమణాదులం జేయుచుండు,

శ్లో॥ త్వగాదిధాతూనాశ్రిత్యపంచనాగాదయఃస్థితాః।
ఉద్గారాదినిమేషాదిక్షుత్పిపాసాదికంక్రమాత్॥
౩౩॥ తంద్రాప్రభృతిశోకాది తేషాంకర్మప్ర
కీర్తితం॥ ౩౪॥

తా॥ నాగకూర్మాది పంచవాయువులు త్వగాదిధాతువుల నాశ్రయించి ఉద్గారనిమేషాదుల నాకలిదాహంబుల ఆలస్యశోకాదులంజేయుచుండు,

శ్లో॥ అగ్నేస్తులోచనంరూపందీప్తకాశంప్రకాశతాం।
మర్షాచతైక్ష్ణ్యంసూక్ష్మంచబీజస్తేజశ్చశూరతా॥
౩౫॥ మేధావితాతధాధత్తే జలాత్తురసనంరసః।
శైత్యంస్నేహంద్రవంస్వేదం మూత్రాదిమృదు
తామపి॥ ౩౬॥ భూమేఘ్రాణేంద్రియంగంధం
స్థైర్యంధైర్యంచగౌరవం । త్వగస్పృష్టాంసమేదోస్థి
మజ్జాశుక్లానిధాతవః॥ ౩౭॥

తా॥ అగ్నిలోచనరూపంబై ప్రకాశదీప్తుల మర్షాతైక్ష్ణ్యంబుల సూక్ష్మంబును తేజంబునుంజేయుచుండు రసంబు మేధయు శైత్యంబు స్నేహంబు ద్రవస్వేదంబుల మూత్రమృదుత్వంబులంజేయు భూమివలన ఘ్రాణంబు స్థైర్యధైర్యంబుల గౌరవంబుంజేయు త్వగింద్రియంబు అస్పృష్టాంబుల మజ్జా శుక్లాదులంజేయు,

శ్లో॥ అన్నంపుంసాశ్నితంత్రేధాజాయతేజఠరాగ్నినా।
మలంస్థవిష్ఠోభాగస్స్యా న్మధ్యమోమాంసతాం

వ్రజేత్ ॥ ౩౭ ॥ మనఃకనిష్ఠోభాగస్స్యాత్తస్మాద
న్నమయంమనః॥ ౩౮॥

తా॥ అన్నంబు భుజింపంబడి జఠరాగ్నిచే మూడువిధంబులు గానగు నందు మొదటిభాగంబు మలినంబు రెండవది మాంసంబు మూడవది మనోరూపంబగు,

శ్లో॥ అపాంస్థవిష్ఠోమూత్రం స్యాన్మధ్యమోరుధిరంభ
వేత్ । అణిష్ఠభాగఃప్రాణస్స్యాత్తస్మాత్ప్రాణో
జలాత్మకః॥ ౩౯॥

తా॥ జలంబుద్రావంబడి మూడువిధంబులగు. అందు మొదటిదిమూత్రంబు రెండవది రుధిరంబు మూడవది ప్రాణరూపంబగు,

శ్లో॥ తేజసోస్థిస్థవిష్ఠంస్యాన్మజ్జాస్యాన్మధ్యమోద్భవా।
అణిష్ఠావాఙ్మతాతస్మాత్తేజోభిన్నాత్మకంజగత్ ॥
౪౦॥ లోహితాజ్జాయతేమాంసం। మేదోమాం
ససముద్భవం । వాతపిత్తకఫాస్తత్ర ధాతవఃపరి
కీర్తితాః॥౪౧॥ దశాంజలిజలంజ్ఞేయం రసస్యాం
జలయోనవ॥ ౪౨॥

తా॥ తేజంబునకు అస్థి ప్రథమభాగంబు రెండవది మజ్జయు మూడవది వాగ్రూపంబగు లోహితంబున మాంసంబుగలుగు దానివలన మేదంబుగలుగు వాతపిత్తకఫంబులు దానికి ధాతువులు దేహంబందు జలంబు పదియంజలులుండు రసంబు తొమ్మిదియంజలులుండు,

శ్లో॥ రక్తస్యాష్టౌపురీషస్య సప్తస్యుఃశ్లేష్మణశ్చషట్।
పిత్తంచపంచచత్వారో మూత్రస్యాంజలయస్త్ర
యః॥ ౪౩॥ వసాయామేదసోద్వౌతు మజ్జాత్వం
జలిసమ్మితా । అర్ధాంజలిమితంశుక్లం తదేవబల
ముచ్యతే॥ ౪౪॥

తా॥ రక్తంబున కెనిమిదిపురీషంబున కేడు శ్లేష్మంబున కారునంజలులై యుండు మరియు పిత్తంబునకునలువదైదు మూత్రంబుకు మూడువసకు మేదంబునకు రెండుమజ్జకొకటి శుక్లంబున కొకటియునైయుండు అది యబలంబనంబరగు.

శ్లో॥ అస్థ్నాంశరీరేసంఖ్యాస్యాత్ షష్టియుక్తంశతత్రయం। జలజానికపాలాని రుచకాస్తరుణానిచ॥ ౯౭॥ నవకానితతాన్యాహుః పంచధాస్థీనిసూరయః। ద్వేశతేత్వస్థిసంధీనాం స్యాతామత్రదశోత్తరే॥ ౯౮॥ కౌరవాప్రసరాస్తుంద సేచనాస్యురులూఖలాః। సముద్రామండలాశ్శంఖా వర్తవాయసకుండలాః॥ ౯౯॥ ఇత్యష్టధాసముద్దిష్టాశ్శరీరేత్వస్థిసంధయః।సార్ధకోటిత్రయంలోమ్నాంశ్మశ్రుకేశాంఘ్రిలక్షితాః॥ ౧౦౦॥

తా॥ శరీరంబున నెముకలు మున్నూటఱువదియుండు అవి జలజంబులు కపాలంబులు రుచకంబులు తరుణంబులు నవకంబులునని యైదువిధంబులుగానుండు శరీరంబున అస్థిసంధులు యిన్నూటపదికలవు అవి కౌరవంబులు ప్రసరంబులు తుందసేచనంబులు ఉలూఖలంబులు సముద్రంబులు మండలంబులు శంఖంబులు ఆవర్తవాయస కుండలంబులు నని యెనిమిదివిధంబులుగానుండు శరీరంబుననుండు రోమంబులకు మూడున్నరకోటిసంఖ్య గలిగియుండును.

శ్లో॥ దేహస్వరూపమేవంతే ప్రోక్తందశరథాత్మజ। యస్మాదసారోనాస్త్యేవ పదార్థోభువనత్రయే॥ ౧౦౧॥ దేహేస్మిన్నభిమానేన హేయోపాదేయబుద్ధయః। అహంకారేణపాపేన క్రియతేహంతసాంతతం॥ ౧౦౨॥ తస్మాద్దేతత్స్వరూపంతుబోద్ధవ్యంతుముముక్షుభిః॥ ౧౦౩॥

తా॥ ఓదళరధనందనా దేహస్వరూపంబిట్టిది నీకెరుంగించితి యీ శరీరంబునకన్న సారంబులేని పదార్థం బొకటియు మూడులోకంబులలేదు యిట్టిదేహంబుపై భ్రాంతిచే బుద్ధిహీనులు అహంకారయుతులై పాపంబులాచరింతురు గాన దీనిస్వరూపంబు మోక్షాపేక్షగలవా రెరుంగందగునని సదాశివుండు శ్రీరామున కెరుంగించెను.

ఇతి శ్రీపద్మపురాణే.

శ్రీమచ్ఛివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శివరాఘవసంవాదే శరీరనిరూపణం
నామ నవమోధ్యాయః.

ఇది పద్మపురాణంబున శ్రీకరంబై యుపనిషద్రూపమైనదియు
పరబ్రహ్మ విద్యయైనట్టి శివగీతలనెడు యోగశాస్త్రంబున
శివరాఘవ సంవాదరూపంబైన శరీర నిరూపణంబను
తొమ్మిదవ యధ్యాయము ముగిసెను.

## దశమోధ్యాయః.

శ్రీరామ ఉవాచ.

శ్లో॥ భగవన్కుత్రజీవోసౌ జంతోర్దేహేవతిష్ఠతి।జాయతేవాకుతోజీవః స్వరూపం వాస్యకింవద। దేహంతేవాకుత్రయాతి గత్వావాకుత్రతిష్ఠతి।కథమాయాతివాదేహం పునర్నాయాతివావద॥౨

తా॥ శ్రీరాముండు జెప్పుచున్నాడు ఓదేవదేవాజీవుండు జంతుదేహంబున నెక్కడనుండు దానిస్వరూపంబెట్టిదది యట్లుగలుగు దేహంబు నశించినపిమ్మట నేచటికరుగు నెచటనుండు మరలనెట్లువచ్చు నెరుంగింపుమనిన,

శ్రీ భగవానువాచ.

శ్లో॥ సాధుపృష్టంమహాభాగ గుహ్యాద్గుహ్యతరంహియత్ । దేవైరపిసుదుర్జ్ఞేయం ఇంద్రాద్యైర్వామహర్షిభిః ॥౩ ॥ అన్యస్మైనైవవక్తవ్యం మయాపిరఘునందన । త్వద్భక్త్యాహం పరంప్రీతో వక్ష్యామ్యవహితశ్శృణు॥౪॥ సత్యజ్ఞానాత్మకోనంత స్సచ్చిదానందవిగ్రహః। పరమాత్మాపరంజ్యోతిరవ్యక్తోవ్యక్తకారణం॥ ౫॥ నిత్యోవిభుశ్చసర్వాత్మా నిర్లేపోహంనిరంజనః। సర్వధర్మవిహీనశ్చనగ్రాహ్యోమనసాపివా॥౬॥ నాహంసర్వేంద్రియైర్గ్రాహ్యస్సర్వేషాంగ్రాహకోహ్యహం।

శంభుండిట్లనియె.

తా॥ ఓమహాత్మా యతిరహస్యంబైన దాని నడిగితివి ఇంద్రాద్యమరులకు సనకాదిమహర్షులకైన నెరుంగనవిగాదు నేనొకరికిం జెప్పలేదు నీభక్తికి బ్రసన్నుండనై వచించెద నాదరణచే వినుము, నేసత్యజ్ఞానాత్మకుండనై సచ్చి

దానందరూపుండనై అవ్యక్త కారణుండనై నిత్యుండ విభుండ నిర్లేపుండ నిరంజనుండనై సర్వకర్మంబులవిడిచి మనంబున కింద్రియంబుల కగమ్యుండ నైయుందు.

శ్లో॥ జ్ఞాతాహంసర్వలోకస్య మమజ్ఞాతానవిద్యతే॥ ౭॥ మాఽరస్సర్వ వికారాణాం పరిమాణాదికస్య చ। యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసా సహ॥౮॥ ఆనందంబ్రహ్మామాంజ్ఞాత్వా నబిభేతి కుతశ్చన॥ ౯॥

తా॥ సర్వలోకంబుల కగమ్యుండనే సకలం బెఱింగినవాఁడ సర్వవికారంబులకు పరిమాణంబులులేక వాక్కులవచింప నలవిగాకమనంబున కగోచరుండనై ఆనందమయుండనైయున్న నన్నెఱుంగువారికి భయంబులేదు.

శ్లో॥ యస్తుసర్వాణిభూతాని మయ్యేవేదంప్రపశ్యతి। మాంచసర్వేషుభూతేషు తతోనవిజుగుప్సతే॥౯॥ యస్యసర్వాణిభూతాని ఆత్మైవాభూద్విజానతః। తత్రకోమోహఃకశ్శోకఏకత్వమనుపశ్యతః॥౧౦॥

తా॥ యెవ్వండైన సకలభూతంబు లనేకరూపుంగా నన్నెఱుంగునాతనికి జుగుప్సలేదు సర్వభూతంబుల కాత్మనైయున్న నన్నెఱుంగువానికి మోహ శోకంబులులేవు.

శ్లో॥ ఏషుసర్వేషుభూతేషు గూఢాత్మాన ప్రకాశతే। దృశ్యతేత్వగ్రియాబుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః॥౧౧॥ అనాద్యవిద్యయాయుక్తస్తథాప్యేకోహమవ్యయః। అవ్యాకృతబ్రహ్మరూపో జగత్కర్తాహమీశ్వరః॥ ౧౨॥

తా॥ సకలభూతంబుల గూఢంబుగానున్న నన్ను సూక్ష్మబుద్ధులెఱుంగుదురు. నేననాద్యవిద్యాయుక్తుండనై ఏకరూపుండ నవ్యయుండనై బ్రహ్మరూపినై జగత్కారణుండనై ఈశుండనైయుందు.

శ్లో॥ జ్ఞానసూత్రేయథాదృశ్య మిదంస్వప్నే జగత్ర
యం। తద్వన్మయిజగత్సర్వం దృశ్యతే స్తివిలీయ
తే॥౧౩॥ నానావిద్యాసమాయుక్తో జీవత్వేనవ
సామ్యహం। పంచకర్మేంద్రియాణ్యేవం పంచజ్ఞా
నేంద్రియాణిచ॥౧౪॥ మనోబుద్ధిరహంకారశ్చి
త్తంచేతిచతుష్టయం। వాయవః పంచమిళితా
యాంతిలింగశరీరతాం॥ ౧౫॥

తా॥ లోకత్రయంబులు స్వప్నపదార్థంబులుంబోలె నాయందుగానం బడునణంగు నేవిద్యాసమేతుండనై జీవరూపంబుననుందు పంచకర్మేంద్రియంబులు పంచజ్ఞానేంద్రియంబులు మనోబుద్ధ్యహంకార చిత్తంబులు పంచవాయువులుంగూడి లింగరూపంబునొందు.

శ్లో॥ తత్రావిద్యాసమాయుక్తం చైతన్యం ప్రతిబింబి
తం। వ్యావహారికజీవస్తు క్షేత్రజ్ఞః పురుషోపిచ॥
౧౬॥ సఏవజగతాంభోక్తా నాత్యయఃపుణ్య
పాపయోః। ఇహాముత్రగతిస్తస్య జాగ్రత్స్వ
ప్నాదిభోక్తృతా॥౧౭॥యథాదర్పణకాళిమ్నా
మలినందృశ్యతేముఖం। తద్వదంతఃకరణగైర్దో
షైరాత్మాపిదృశ్యతే॥౧౮॥ పరస్పరాధ్యాసవ
శా త్స్యాదంతఃకరణాత్మనోః। ఏకీభావాభిమా
నేన పరాత్మాభోగభాగివ॥ ౧౯॥

తా॥ అందవిద్యతోఁగూడి చైతన్యంబొప్పు వ్యవహారంబున క్షేత్రజ్ఞుండై జీవుండువెలుంగు నాతండె భోక్తయైనాశరహితుండై జాగ్రత్స్వప్నాదులం గూడియుండు నద్దంబున మలినంబు ముఖంబున గానంబడునట్లు అంతఃకరణదోషంబుల పరమాత్మయు గానంబడదు సర్వాభ్యాసవశంబున అంతఃకరణాత్మలకే కీభావంబున పరమాత్మ సర్వభోగభాగియుంబోలెనుండు.

శ్లో॥ మరుభూమౌజలత్వేన మధ్యాహ్నే రవిమరీచి
కాః। [illegible] స్తుపత్తే

వి॥౨౦॥ తద్వదాత్మాపిని ర్లేపో దృశ్యతేమూఢ
చేతసా।

తా॥ మరుభూమినియర్క రశ్మలు జలభ్రాంతి గలుగంజేయుగాని సూర్యుం డాగ్రహించుగాడు అట్లనాత్మయు మూఢులచే నిర్లేపుండుగా నెరుంగంబాలడు.

శ్లో॥ స్వావిద్యామాత్రదోషేణ కర్తృత్వాదిక ధర్మ
వాక్ ॥౨౧॥ తత్రచాన్నమయేపిండే హృదిజీ
వోవతిష్ఠతి । ఆనఖాగ్రంవ్యాప్యదేహే తద్వ్రి
వోవహితశ్శ్రుణు ॥ ౨౨ ॥ పురీతదభిమానేన
మాంసపిండోవిరాజతే । నాభేరూర్ధ్వ మధఃకం
ఠాద్వ్యాప్యతిష్ఠతియత్సదా॥ ౨౩॥

తా॥ విద్యామాత్రదోషంబున కర్తృత్వధర్మంబున అన్నమయపిండంబున జీవుండుండు ఆతండునఖంబుల పర్యంతంబు దేహంబున వ్యాపించి భూరి మధ్యంబున మాంసపిండంబున నాభికూర్ధ్వంబునకంఠాధోభాగంబునుండు.

శ్లో॥ తస్యమధ్యేస్తిహృదయం సనాళంపద్మకోశవత్ ॥
౨౪॥ అధోముఖంచతత్రాస్తి సూక్ష్మంసుషిరము
త్తమం । దహరాకాశమిత్యుక్తం తత్రజీవోవతి
ష్ఠతి ॥౨౫॥ వాలాగ్రశతభాగస్య శతధాకల్పిత
స్యచ। భాగోజీవస్సవిజ్ఞేయ స్సచానంత్యాయక
ల్పతే ॥౨౬॥ కదంబకుసుమోద్భూతాః కేస
రాఇవసర్వతః । ప్రసృతా హృదయాన్నాడ్యో
యాభిర్వ్యాప్తంశరీరకం ॥౨౭ ॥ హితంబలంప్ర
యచ్ఛంతి తస్మాత్తేనహితాఃస్మృతాః । ద్వాస
ప్తతిసహస్రైస్తా స్సంఖ్యాతాయోగవిత్తమైః ॥
౨౮॥ హృదయాత్తావినిష్క్రాంతాయథారా
శ్మయస్తథా ... సుముఖ్యావి

ష్వగ్నివిర్గతాః ॥౨౯॥ ప్రతీంద్రియందశదశనిర్గ
తావిషయోన్ముఖాః। నాడ్యశ్శర్మాదిహేతూర్ధ్వస్వ
ప్నాదిఫలభుక్తయే॥౩౦॥ విహాంత్యంభోయథా
నద్యో నాడ్యఃకర్మఫలంతథా। అనావృత్తైకగా
నాడీ మూర్ధపర్యంతమంజసా॥౩౧॥ సుషుమ్నేతి
సమాదిష్టాతయాగచ్ఛన్విముచ్యతే। తత్రావచ్ఛి
న్నచైతన్యం జీవాత్మానంవిదుర్బుధాః॥౩౨॥ య
థారాహురదృశ్యోపి దృశ్యతే చంద్రమండలే।
తద్వత్సర్వగతోప్యాత్మా లింగదేహేపి దృశ్యతే॥
౩౩॥ నీయమానేయథాకుంభే ఘటాకాశోపినీ
యతే। నిశ్చలంపరిపూర్ణోపి గచ్ఛతీత్యుపచర్య
తే॥౩౪॥ జాగ్రత్కాలెయథాక్షేయ మభివ్యక్త
విశేషధీః। వ్యాప్నోతినిషిద్ధియాస్సర్వాభాను
ర్దశదిశోయథా॥ ౩౫॥

తా॥ వానిమధ్యంబున సనాళపద్మకోశంబున అధోముఖంబై సూక్ష్మం బైన సుషిరంబుదహరాకాశంబనం బరగియుండు దానిపై జీవుండుండు అనేకవిధ కల్పితంబైన వాలాగ్రశతభాగంబు జీవభాగంబైయుండు అదిఅనంత్యంబునకై కల్పితంబద్యో కదంబకుసుమసంభూత కేసరంబులుంబోలె హృదయ ప్రసృతంబులై శరీరంబెల్ల వ్యాపించి డెబ్బదిరెండువేల సంఖ్య గలిగి నాడులు సూర్యరశ్ములుంబోలెనుండు అందు నూటొక్కనాడులు ముఖ్యంబులై యింద్రియంబుల కొక్కట్కొపదేసివంతున విషయోన్ముఖంబులై శర్మహేతుకంబులై స్వప్నఫలభుక్తికై సముద్రుంజేరు నదులంబోలె కర్మఫలంబునొందు అందొకటి మూర్ధపర్యంతంబువ్యాపించి సుషుమ్నయనంబరగి యుండు దానితోగూడి చైతన్యరూపుండై జీవాత్మయుండు రాహువుతాగానంబడక చంద్రమండలంబు గ్రహించురీతి ఆత్మసర్వగతుండై లింగదేహారూపియైయుండు కుంభంబునెత్తికొనిపోవ దానియందలి నాకాశంబును పోవు రీతి పరిపూర్ణుండైన ఆత్మగదలుచుండు సూర్యుండుదశదిక్కుల వెలుంచుదంబున ఆత్మసకలదేహంబుల వెలుంగు.

శ్లో॥ నాడీభిర్వృత్తయోయాంతి లింగదేహ సముద్భవాః। తత్తత్కర్మానుసారేణ జాగ్రద్భోగోపలబ్ధయే॥౩౬॥ ఇదంలింగశరీరాఖ్య మామోక్షాన్న వినశ్యతి। ఆత్మజ్ఞానేననష్టేస్మిౝ సావిద్యేస్వశరీరకే॥ ౩౭॥ ఆత్మస్వరూపావస్థానం ముక్తిరిత్యభిధీయతే। ఉత్పాదితఘటేయద్వద్ఘటాకాశత్వమేత్యచ॥౩౮॥ ఘటేనష్టేఘటాకాశః స్వరూపేణావతిష్ఠతే॥ జాగ్రత్కర్మక్షయవశాత్స్వప్నభోగఉపస్థితే॥౩౯॥ బోధావస్థాంతిరోధాయ దేహాద్యాశ్రయలక్షణం। కర్మోత్పాదితసంస్కారస్తత్రస్వప్నరిరంసయా॥ ౪౦॥

తా॥ లింగదేహసంభవంబులై నానావిధనాడులు తత్తత్కర్మానుసారంబులగునా లింగశరీరంబు మోక్షంబువరకు నశించదు శరీరనాశంబైనను ఆత్మజ్ఞానంబుననుంట మోక్షంబు ఘటంబు నశించినను దానియందలి యాకాశంబుండురీతి శరీరనాశంబైన నాత్మస్థిరంబుగానుండు జాగ్రత్కర్మక్షయంబున స్వప్నభోగంబులభాతి దేహాదులు తిరోధానంబులగు.

శ్లో॥ అవస్థాంచప్రయాత్యన్యాం మాయావీచాత్మమాయయా ఘటాదివిషయాంత్సర్వాౝ బుధ్యాదికరణానిచ॥౪౧॥ భూతాదీన్కర్మవశతో వాసనామాత్రతఃస్థితాౝ। ఏతాౝపశ్యౝ స్వయం జ్యోతి స్సాక్షాత్మావ్యవతిష్ఠతే॥ ౪౨॥

తా॥ మాయావియగు ఆత్మ తన మాయచే మరియొక యవస్థం బొంది ఘటాదివిషయంబుల బుధ్యాదికరణంబుల వాసనామాత్ర స్థితంబులైన భూతాదుల సాక్షాత్కారంబున పరమాత్మ వెలుంగు.

శ్లో॥ తత్రాంతఃకరణాదీనాం సర్వేషాం వాసనాత్మతాం। ప్రపంచమాత్రసాక్షిత్వం తేనతత్రపరా

త్మనః॥౪౩॥ వాసనాభిః ప్రపంచోఽత్ర దృశ్యతే స్వప్నచోదితః। జాగ్రద్భూమా యదా తద్వత్కర్తృకర్మక్రియాత్మకః ॥ ౪౪ ॥ నిశ్శేషబుద్ధిసాక్షిత్వాత్స్వయమేవప్రకాశతే।

తా॥ ప్రపంచంబు స్వప్నపదార్థంబుబోలె గానంబడుచు కర్మక్రియాదులం గూడియుండు అజినశించినను ఆత్మ తానశించదు.

శ్లో॥ వాసనామాత్రసాక్షిత్వం సాక్షిణః స్వాప ఉచ్యతే॥౪౫॥ భూతజన్మనియమ్యాభితం కర్మతద్వాసనవశాత్। నేదీయః స్యాద్వయస్యాద్వే స్వప్నేప్రాయః ప్రపశ్యతి॥ ౪౬॥

తా॥ వాసనాసాక్షిత్వంబు స్వాపంబని చెప్పంబడు భూతంబులవలనం గలిగి కర్మవాసనచే శరీరంబు స్వప్నప్రాయంబుగానుండు.

శ్లో॥ మదేవయసికార్కశ్యా తత్కరణానామిహార్పితః। ప్రాయేణవీక్ష్యతే స్వప్నే వాసనాః కర్మణోవశాత్॥౪౭॥ యియాసుః పరలోకంతు కర్మవిద్యాదిసంభృతం। భావినోజన్మనోరూపం స్వప్న ఆత్మా ప్రపశ్యతి॥౪౮॥ యద్యుత్పతనాక్ష్యేనః శ్రాంతోఽగగనమండలే। సంకుచ్య పక్షౌయతతే నీడోనిలయనాయసః॥౪౯॥ ఏవం జాగ్రత్స్వప్నభూమౌ శ్రాంతఆత్మాపిసంచరన్। విలీనకరణగ్రామః కారణేనైతిచైకతాం॥౫౦॥ నాడీమార్గేణేంద్రియాణాం మాకృష్యాదాయవాసనాః। సర్వంగ్రసిత్వా కార్యంచ విజ్ఞానాత్మాప్రలీయతే॥౫౧॥ ఈశ్వరాఖ్యేవ్యాకృతేచ తదాసుఖమయోభవేత్। కృత్స్నప్రపంచవిలయస్తదాభవతిచాత్మనః॥౫౨

తా॥ పమోపదంబున కఠిన కార్యంబుల నొనర్చక తరుచుగా పరలో కాపేక్షచే అవిద్యారూపంబులైన కర్మంబు లాచరించెనేని అది భవిష్యజ్జన్మ కారణంబగుఁగాని పరంబుగలుగంజాలదు అచ్చటచ్చట పతనంబుచే శ్రాంతంబై విహంగంబుగ గనమండలంబున రెక్కలసంకోచించి నిలయనంబుజేర యత్నించినరీతి ఆత్మయు జాగ్రత్స్వప్నాదుల శ్రాంతినొంది విలీనంబైయేకత్వంబునొంది నాడీమార్గంబున వాసనచే సర్వంబుగ్రసించి విజ్ఞానరూపంబై వెలుంగు ఈశ్వరాఖ్యంబైన వ్యాకృతియందు సుఖమయంబైన సకలప్రపంచంబు ఆత్మమయంబగు.

శ్లో॥ మోషితఃకామ్యమానాయా స్సంభోగాంతేయ థాభవేత్। సఆనందమయోబాహ్యే నాంతరః కేవలస్తథా॥ ౫౩॥ ప్రజ్ఞాత్మతాంసమాసాద్య విజ్ఞానాత్మాతథైవసః। విజ్ఞానాత్మాకారణాత్మాతదాతిష్ఠత్తథాపిసః॥౫౪॥ అవిద్యానూత్మవృత్త్యా సుభవత్యేవసుఖంతథా । అజ్ఞానమపిసూత్మాభిర్వృత్తిభిశ్చానుభూయతే॥౫౫॥ తదాహంసుఖమస్వాప్సం నైవకించిదవేదిషం। ఇత్యేవంప్రత్యభిజ్ఞాపి పశ్చాత్తస్యోపపద్యతే॥౫౬॥ జాగ్రత్స్వప్నసుషుప్త్యాఖ్యమేవేహాముత్రలోకయోః। పశ్చాత్కర్మవశాదేవ విస్ఫులింగా ఇవానలాత్॥౫౭॥ జాయంతేకారణాదేవ మనోబుధ్యాదికానితు। పయఃపూర్ణఘటోయద్వ న్నిమగ్నస్సలిలాశయే॥౫౮॥ తైరేవోద్ధృతఆయాతి విజ్ఞానాత్మాతథైత్యజాత్॥ విజ్ఞానాత్మాకారణాత్మా తయాతిష్ఠత్తథాపిసః॥ ౫౯॥ దృశ్యతేసత్సుతేష్వేవ నష్టేష్వాయాత్యదృశ్యతాం। ఏకాకారోర్యమాయద్వ త్కార్యేష్వేవ పరఃపుమాన్॥ ౬౦॥ కూటస్థోదృశ్యతేతద్వ ద్గచ్ఛత్యాగచ్ఛతో

పిసః। మోహమాత్రాంతరాయత్వా త్సర్వం తస్యోపపద్యతే ॥౬౧॥ దేహాద్యతీతఆత్మాపి స్వయంజ్యోతిస్స్వభావతః।ఏవంజీవస్వరూపంతేప్రోక్తందశరథాత్మజ॥ ౬౨॥

తా॥ నరుండుతాగోరినస్త్రీ సంభోగాంతంబున గలిగిన యానందంబు బాహ్యానందంబట్ల అంతరానందంబు వెలుంగు విజ్ఞానాత్మప్రజ్ఞంబొందు అవిజ్ఞానాత్మకారణాత్మయై అవిద్యచేగూడి సుఖంబునొంది సూక్ష్మవృత్తుల నజ్ఞానంబునొంది నేనుసుఖించితి ననితలంచుచు పిమ్మట దానింబొందు ఇహపరలోకంబుల జాగ్రత్స్వప్నసుషుప్తులు కర్మవశంబున అగ్నివిస్ఫులింగంబులుంబోలె కర్మవశంబున మనోబుద్ధ్యాదికంబులుగలుగు జలపూర్ణఘటంబు జలంబులమునింగి ఆజలంబుల మరల నుద్ధృతంబైవెలుంగునట్లవిజ్ఞానాత్మయు కారణాత్మంగూడి లోకంబులవెలుంగు ఆలోకంబులు నశించిన తానదృశ్యంబగు సూర్యుంబోలే పరమాత్మ ఏకాకారుండై కూటస్థుండైయుండు అతండు సకలంబున సంచరించుచు వచ్చుచుంబోవుచు మోహాదులగలిగించుచు దేహాదుల స్వయం జ్యోతియై వెలుంగు ఓరామచంద్రా జీవస్వరూపంబు నీకెరుంగించితి నని యీశ్వరుండు వక్కాణించెను.

ఇతి శ్రీపద్మపురాణే.

శ్రీమచ్ఛివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శివరాఘవసంవాదే—జీవస్వరూపనిరూపణంనామ దశమోధ్యాయః.

ఇది పద్మపురాణంబున శ్రీకరంబై యుపనిషద్రూపమైనదియు పరబ్రహ్మవిద్యయైనట్టి శివగీతలనెడు యోగశాస్త్రంబున శివరాఘవ సంవాదరూపంబై జీవస్వరూప నిరూపణంబను పదవ యధ్యాయము ముగిసెను.

# ఏకాదశోధ్యాయః.

## శ్రీభగవానువాచ.

శ్లో ॥ దేహాంతరగతింతస్య పరలోకగతింతథా । వ
క్ష్యామినృపశార్దూలమత్తః శ్రుణుసమాహితః॥
౧॥ భుక్తంపీతంయదస్త్యత్ర తద్రసోదానుబంధ
నం । స్థూలదేహస్యలింగస్య తేనజీవనధారణం॥
౨॥ వ్యాధినాజరయావాపి పీడ్యతేజాఠరోనలః।
శ్లేష్మణాతేనభుక్తాన్నం పీతంవానపచత్యలం ॥౩॥
భుక్తపీతరసాభావా త్తదాశుష్యంతిధాతవః ।
భుక్తపీతరసేనైవదేహాలిప్యతినిత్యశః॥౪॥ సమీ
కరోతియత్తస్మా త్సమనోవాయురుచ్యతే। ఇదా
నీంతద్రసాభావా ద్దామబంధనహానితః ॥౫॥ పరి
పక్వరసత్వేన యథాౘమంవృంతతఃఫలం ॥౬॥
స్వయమేవపతత్యాశుతథాలింగతనోర్వ్రజేత్ ॥
౭॥ తత్తత్థానాదపాకృష్య హృషీకాణాంచవా
సనాః । ఆధ్యాత్మికాదిభూతాని హృత్పద్మేచైక
తాంగతః ॥౮॥ తతఊర్ధ్వగతఃప్రాణ స్సంయు
క్తోనవవాయుభిః। ఊర్ధ్వోచ్ఛ్వాసీభవత్యేవయదా
తేనైకతాంగతః ॥౯॥ చక్షుషోర్వాథమూర్ధ్వో
వానాడీమార్గంసమాశ్రితః। విద్యాకర్మసమా
యుక్తో వాసనాభిశ్చసంయుతః॥ ౧౦॥

తా॥ సదాశివుండు చెప్పుచున్నాడు ఓరామచంద్ర జీవునకు దేహాంతర
గమనంబు పరలోకగమనంబును నెరింగించెదవినుము భుజించిన యన్నంబు
పీతంబైరసంబుతోగూడి స్థూలదేహలింగంబుల జీవనధారణంబై వెలయు

వ్యాధిచేతను ముసలితనంబుచేతను జాఠరాగ్నిపీడితంబైయుండు శ్లేష్మచేతను భుక్తాన్నంబు పీడితంబై పచనంబగు భుక్తిరసాభావంబులై ధాతువులుశోషించు భుక్తపీతరసంబులచే దేహంబులుతప్తంబగు మనోవాయువులు సమంబులగు ఆరసాభావంబు దామబంధనహానివలన పరిపక్వరసముచే వృత్తంబునుండిజారిన మామిడిపండురీతి తాను నశించు ఇట్లు లింగశరీరంబువలన నానాస్థానంబులనుండి ఇంద్రియంబులు వాసనావశంబున ఆధ్యాత్మికాధి భూతంబులేకంబైయుండు పిమ్మట ప్రాణంబూర్ధ్వగతంబై నవవాయువులంగూడి ఊర్ధ్వోచ్ఛ్వాసిరై ఏకత్వంబునొంది కనులవలననైన శిరంబువలననైన నాడీమార్గంబున విద్యాకర్మయుతంబై వాసనాసమేతంబై.

శ్లో॥ ప్రజ్ఞాత్మానంసమాశ్రిత్య విజ్ఞానాత్మోపసర్పతి।
యథాకుంభోనీయమానో దేశాద్దేశాంతరంప్రతి॥ ౧౦॥ సంపూర్ణఏకస్సర్వత్ర సఆకాశోపితత్రతు। ఘటాకాశాత్మతాంయాతి తద్వల్లింగంపరాత్మనః॥ ౧౧॥ పునర్దేహాంతరంయాతి యథాకర్మానుసారతః। ఆమోక్షాత్సంచరత్యేవం మత్స్యఃకూలద్వయంతథా॥ ౧౨॥ పాపభోగాయచేద్గచ్ఛే ద్యమదూతైరధిష్ఠితః। యాతనాదేహమాశ్రిత్య నరకానేవగచ్ఛతి॥ ౧౩॥

తా॥ ప్రజ్ఞాత్మనుబొంది విజ్ఞానాత్మంగూడు ఘటంబుదేశాంతరంబునూర్చి నీయమానంబై సంపూర్ణంబై యాకాశంబు ఘటాకాశత్వంబునొందినట్లు లింగంబాత్మయగు ఆదిచరల మరియొక దేహంబును కర్మానుసారంబుగానొంది మోక్షపర్యంతంబు దిరుగుచు పాపంబులనుభవించుచు యమదూతలచే యాతనాశరీరంబునొంది బాధింపంబడుచు నానా నరకబాధలంబొందు.

శ్లో॥ ఇష్టాపూర్తాదికర్మాణి యోనుతిష్ఠతిసర్వదా। పితృలోకం ప్రజత్యేష యానుమాశ్రిత్యబహిర్షః॥ ౧౪॥ ధూమోరాత్రిస్తథాకృష్ణపక్షస్తస్మాచ్చదక్షిణం। అయనం చత్వారో లోకం శిత్వా ...

తః పరం॥ ౧౭॥ చంద్రలోకే దివ్యదేహం ప్రాప్య భుఙ్క్తే పరాం శ్రియమ్। తత్ర చంద్రసమానోఽసౌ యావత్కర్మఫలం వసేత్॥ ౧౮॥ తథైవ కర్మశేషేణ యథేతం పునరావ్రజేత్। వపుర్విహాయ జీవత్వం ఆసాద్యాకాశమేతి సః॥ ౧౯॥ ఆకాశాద్వాయుమాగత్య వాయోరభ్రం వ్రజత్యథ। అభ్రాన్మేఘం సమాసాద్య తతో వృష్టిర్భవేదసౌ॥ ౧౫॥ తతో ధాన్యాని భక్ష్యాణి జాయంతే కర్మచోదితాః। యోనిమన్యే ప్రపద్యంతే శరీరత్వాయ దేహినః॥ ౧౯॥ ముక్తిమన్యే నుసంయాంతి యథాకర్మ యథాశ్రుతమ్। తతోఽన్నత్వం సమాసాద్య పితృభ్యాం భుజ్యతే పరమ్॥ ౨౦॥ తతశ్శుక్లం రజశ్చైవ భూత్వా గర్భోఽభిజాయతే। తతః కర్మానుసారేణ భవేత్ స్త్రీపుంనపుంసకః॥ ౨౧॥

తా॥ ఇష్టాపూర్తాది సుకర్మంబు లాచరించినవాడు పితృలోకంబునకుం బోయి ధూమంబాశ్రయించి బర్హిషంబు ధూమంబు రాత్రియు పక్షంబు దక్షిణంబు అయనంబిట్లు పితృలోకంబుననుండి పిమ్మట, చంద్రలోకంబుజేరి దివ్యదేహధారియై చంద్రసమానుండై కర్మక్షయంబువరకు ఫలంబనుభవించి కర్మశేషంబునమరలి జీవత్వంబునొంద నాకాశంబుఁజేరి అచ్చటనుండి వాయువుంజేరి అచ్చటనుండి మేఘంబునంజేరి దానివల్ల వర్షంబునంజేరి దానివలన ధాన్యరూపంబునొందు, కొందరు యోనులంబ్రవేశింతురు కొందరు ముక్తింగాంతురు, పిమ్మట అన్నరూపంబునొంది తల్లిదండ్రులచే భుజింపంబడి పిమ్మట శుక్లంబు రజంబునై గర్భరూపంబునొంది వారివారి కర్మానుసారంబుగా పురుషుండైన స్త్రీయైన నపుంసకుండైన నగు.

శ్లో॥ ఏవం జీవగతిః ప్రోక్తా ముక్తిం తస్య వదామి తే। యస్తు శాంత్యాదియుక్తస్సన్ సత్యవాదావిద్యారతో భవేత్॥ ౨౨॥ సయాతి దేవయానేన బ్రహ్మలో

కపథంనరః॥ ౨౨॥ అర్చిర్భూత్వాదినంప్రాప్య
శుక్లపక్షమథోవ్రజేత్ । ఉత్తరాయణమాసా
ద్య సంవత్సరమథోవ్రజేత్॥ ౨౩॥ ఆదిత్యచం
ద్రలోకేతు విద్యుల్లోకమతఃపరం । అథదివ్యం
పుమాన్కశ్చిత్ బ్రహ్మలోకాదిహైతిసః॥ ౨౪॥
దివ్యైవప్రపిసంధాయజీవమేనంనయత్యసౌ॥౨౫॥
బ్రహ్మలోకేదివ్యదేహాన్ భుక్త్వాభోగాన్యథేప్సి
తాన్ । తత్రోషిత్వాచిరంకాలంబ్రహ్మణాసహ
ముచ్యతే॥ ౨౬॥

తా॥ ఓ రామచంద్రా ఇట్లు జీవగతిగల్గు నింక మోక్షప్రాప్తినెఱుంగిం
చెద ఏనరుండైన శాంతిచే విద్యలనభ్యసించునాతండు బ్రహ్మలోకంబునొం
ది అర్చియై దినంబై శుక్లపక్షంబై అయనంబై సంవత్సరంబై ఆదిత్యచంద్ర
లోకంబుల విద్యుల్లోకంబుననుండి దివ్యరూపధారియై బ్రహ్మలోకంబున అ
నేకభోగంబు లనుభవించుచు, బ్రహ్మతోగూడి బహుకాలంబుండు.

శ్లో॥ శ్శుద్ధబ్రహ్మరతోయశ్చ సనయాత్యేవకుత్రచిత్ ।
తస్యప్రాణావిలీయ్యంతె జలేసైంధవపిండవత్॥
౨౭॥ స్వప్నసృష్టిర్యథాస్వప్నే ప్రబుద్ధస్యవిలీ
యతె । బ్రహ్మజ్ఞానవత స్తద్వ ద్విలీయంతేంతశ్శ
వతె॥ ౨౮॥ విద్యాకర్మవిహీనోయ స్తృతీయం
స్థానమేతిసః । భుక్త్వాత్రనరకాన్ ఘోరాన్ మ
హారౌరవరౌరవాన్॥ ౨౯॥ పశ్చాత్ ప్రాక్తన
శేషేణ క్షుద్రోజంతుర్భవేదసౌ । యూకామ
శకదంశాది జన్మాసౌలభతేభువి॥ ౩౦॥ ఏవంజీవ
గతిఃప్రోక్తా కిమన్యచ్ఛ్రోతుమిచ్ఛసి॥ ౩౧॥

తా॥ ఏనరుండైన బ్రహ్మరతుండైయుండు నాతండెచటికింబోకయుండు
వాతని ప్రాణంబులు [illegible] సైంధవంబునందు [illegible] లీనంబులగు

స్వప్నపదార్థంబులు మేలుకన్న వానికిలేనియట్లు బ్రహ్మజ్ఞానికి సకలప్రపంచం
బును బ్రహ్మరూపంబుగానగు, విద్యాకర్మవిహీనుండైనవాడు బహునరకబా
ధలంబొంది పిమ్మట నాపాపశేషంబున క్షుద్రజన్మంబునొంది పిమ్మట యూ
కామశకదంశాది జన్మంబులంబొందు నిది జీవగతి యింక నేమివినంగోరెద
వనిన,

శ్రీరామ ఉవాచ.

శ్లో॥ భగవన్యత్త్వయాప్రోక్తంఫలంతుజ్ఞానకర్మణోః।
బ్రహ్మలోకేచంద్రలోకే భుంక్తేభోగానితిప్రభో॥
౩౧॥ గంధర్వాదిషులోకేషుకథంభోగస్స్యమీా
రితః। దేవత్వంప్రాప్నుయాత్కశ్చి త్కశ్చిదిం
ద్రత్వమేతిచ॥ ౩౨॥ యత్తత్కర్మఫలంవాస్తు
విద్యాఫలమథాపివా। తద్బ్రూహిగిరిజాకాంత
తత్రమేసంశయోభవేత్॥ ౩౩॥

తా॥ శ్రీరాముండుచెప్పుచున్నాడు ఓదేవదేవా నీవానతిచ్చినట్లు నరుం
డు జ్ఞానకర్మఫలంబుల బ్రహ్మలోకంబున చంద్రలోకంబున గంధర్వాదిలో
కంబుల నేయేభోగంబు లనుభవించు వానికి దేవత్వంబు బ్రహ్మత్వం బింద్ర
త్వంబును ఏయే కర్మఫలంబులు గలుగు దాని నెఱింగించి నా సందియంబు
వాపుమనిన,

శ్రీభగవానువాచ.

శ్లో॥ తద్విద్యాకర్మణోరేవా నుసారేణఫలంభవేత్।
యువాచసుందరశ్శూరో నిరోగోబలవాన్భవే
త్॥ ౩౪॥ సప్తద్వీపాంవసుమతీం భుంక్తేనిష్కం
టకంయది సఃప్రోక్తోమానుషానంద స్తస్మాచ్ఛ
తగుణోమతః॥ ౩౫॥ మనుష్యస్తపసాయస్తు గం
ధర్వోజాయతేసతు। తస్మాచ్ఛతగుణానందో
గంధర్వస్యనసంశయః॥ ౩౬॥

శంభుండిట్లనియె.

తా॥ ఓరామచంద్రా! నరుండు పూర్వజన్మకృత విద్యాకర్మఫలంబున యౌవనంబుగలిగి సుందరరూపధారియై శూరుండై నిరోగుండైయుండు సప్తద్వీపంబుల నిష్కంటకంబుగా బాలి చుట, మానుషానందంబది దానికన్న నూరంతలధికంబు మనుజుండు తపంబుచే గంధర్వుండగుట దానికన్న నధికంబు ఇందుకు సందియంబులేదు.

శ్లో॥ ఏవంశతగుణోదేవ ఉత్తరోత్తరతోభవేత్ ।
పితౄణాం చిరలోకానా మాజానసురసంప
దాం॥ ౩౭॥ దేవతానామథేంద్రస్య గుణస్తద్వ
త్ప్రజాయతే। బ్రహ్మణశ్చైవమానందః పురస్తా
దుత్తరోత్తరః॥ ౩౮॥ జ్ఞానాధిక్యాత్సుఖాధిక్యం
నాన్యదస్తీసురాలయె । శ్రోత్రియోవృజినోకామ
హతోయశ్చద్విజోభవేత్॥ ౩౯॥ తస్యాప్యేవం
సమాఖ్యాత ఆనందశ్చోత్తరోత్తరః । ఆత్మజ్ఞా
నాత్పరంనాస్తి తస్మాద్దశరథాత్మజ॥ ౪౦॥ బ్రహ్మా
ణఃకర్మభిర్నైవ వర్ధతేనైవహీయతే। నలిప్య
తేపాపకేన కర్మణోజ్ఞానతాన్యతః॥ ౪౧॥ తస్మా
త్సర్వాధికోవిప్రో జ్ఞానవానేవజాయతే । జ్ఞా
త్వాయఃకురుతేకర్మ తస్యాక్షయ ఫలంభవే
త్॥ ౪౨॥

తా॥ ఇట్లొకటికన్ననొకటి యతిశయంబగు పితృలోక సుఖంబులనొంది పిమ్మట సురలోకసుఖంబులనుభవించి ఇంద్రసుఖంబులంబొంది బ్రహ్మసుఖప్రాప్తినొందు జ్ఞానాధిక్యంబున సుఖాధిక్యంబుగలుగు మరియొకటిలేదు. శ్రోత్రియుండు కామాసక్తింబొందెనేని పాపంబునొందు. గావున నిదియెఱింగి యుత్తరోత్తరానందంబులం బొందవలయు. ఆత్మజ్ఞానంబుకన్న మరియొకటిలేదు. బ్రహ్మకర్మంబుల పాపంబులంబొందదు, గాన బ్రాహ్మణుండు జ్ఞానియయ్యెనేని సర్వాధికుండగు జ్ఞానంబున కర్మంబులాచరించిన అక్షయ ఫలంబబ్బు.

శ్లో॥ యత్ఫలం లభతే మర్త్యః కోటిబ్రాహ్మణభోజ
నైః । తత్ఫలంసమవాప్నోతి జ్ఞానినంయస్తుభో
జయేత్ ॥ ౪౩॥జ్ఞానిభ్యోదియ్యతేయచ్చ తత్కో
టిగుణితంభవేత్ । జ్ఞానవంతంద్విజంయస్తు ద్వి
షత్యేవనరాధమః॥ ౪౪॥ సశుష్యమాణోమ్రియ
తే యస్మాదీశ్వరఏవసః॥ ౪౫॥ ఉపాసకోనయా
త్యేవ యస్మాత్పునరధోగతిం । ఉపాసనపరో
భూత్వా తస్మాదాస్వసుఖీభవాన్॥ ౪౬॥

తా॥ నరుండు కోటిబ్రాహ్మణభోజనంబు గావించినం గలుగుఫలంబొక
జ్ఞానవంతున కన్నంబిడినగల్గు బహుజ్ఞానులకన్నంబిడినదానికన్న కోటిగు
ణంబుగల్గు. యేనరుండైన జ్ఞానికపకారంబుజేయునాతం డెంతయధికుండైన
ను శుష్కకంతుండై మృతింబొందు ఉపాసకుం డధోగతి నెన్నండును
బొందంజాలడు గావున, నీవును ఉపాసకుండవై సుఖివగుమని శివుండు
రామునకుంజెప్పెను.

ఇతి శ్రీపద్మపురాణే.

శ్రీమచ్ఛివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శివరాఘవసంవాదే—ఉపాసనమాహా
త్మ్యం నామైకాదశోధ్యాయః.

ఇది పద్మపురాణంబున శ్రీకరంబై యుపనిషద్రూపమైనదియు పరబ్రహ్మ
విద్యయైనట్టి శివగీతలనెడు యోగశాస్త్రంబునశివరాఘవసం
వాదరూపంబైన ఉపాసన మాహాత్మ్యంబను పదు
నొకండవ యధ్యాయము ముగిసెను.

# ద్వాదశోఽధ్యాయః.

శ్రీరామ ఉవాచ.

శ్లో॥ భగవన్ దేవదేవేశ నమస్తేస్తుమహేశ్వర। ఉపాసనవిధింబ్రూహి దేశంకాలంచతస్యతు ॥ ౧॥
లింగాని నియమాంశ్చైవ మయితేనుగ్రహోయది॥ ౧౫॥

తా॥ శ్రీరాముండు చెప్పుచున్నాడు ఓదేవదేవా ఓమహేశా నీకనేక వందనములుఁజేసెద ఉపాసనవిధి నెఱుంగింపుము దానికి దేశకాలంబుల లక్షణంబు నియమంబుల అనుగ్రహంబున నెఱుంగింపుమనిన,

శ్రీభగవానువాచ.

శ్లో॥ శృణురాజన్ప్రవక్ష్యామి దేశంకాలముపాసనే॥ ౨॥ సర్వాకారోఽహమేవైక స్సచ్చిదానందవిగ్రహః। మదంశేనపరిచ్ఛిన్నా దేవాస్సర్వేదివౌకసః॥ ౩॥ యేప్యన్యదేవతాభక్తా యజంతేశ్రద్ధయాన్వితాః। తేపిమామేవరాజేంద్ర యజంత్యవిధిపూర్వకం॥ ౪॥ యస్మాత్సర్వమిదంవిశ్వం మత్తోనవ్యతిరిచ్యతే। సర్వక్రియాణాంభోక్తాహం సర్వస్యాహంఫలప్రదః॥ ౫॥ యేనాకారేణయే మర్త్యా మామేవైకముపాసతే। తేనాకారేణతేభ్యోఽహం ప్రసన్నోవాంఛితందదే॥ ౬॥

సదాశివుండిట్లనియె.

తా॥ ఓ రామచంద్రా! ఉపాసనంబునకు దేశకాలంబు లెఱుంగించెద వినుము. నే సర్వాకారుండ సచ్చిదానందవిగ్రహుండ సకలదేవతలును నా యంశభవులుగా నెఱుంగుము. యేనరులైన యితరదేవతల నారాధించిరేని యా వారలునన్నుంబూజించినవారలే సర్వవిశ్వంబును నాయంశంబు నన్ను

విడిచి మరియొకటిలేదు. నేసర్వక్రియాభోక్తనై సర్వఫలప్రదాతనై యుందు నరులు యే రూపంబును బూజించిన నారూపంబుచే వారలకు ప్రసన్నుండనై వాంఛితింబొసంగుదు.

శ్లో॥ విధినావిధినావాపి భక్త్యాయేమాముపాసతే।
తేభ్యఃఫలంప్రయచ్ఛామి ప్రసన్నోహంనసం
శయః॥ ౭॥

తా॥ విధిపూర్వకంబుగానైన అట్లులేకనైన నన్ను పూజించువారలకే ప్రసన్నుండనై ఫలంబొసంగుదు సందియంబులేదు.

శ్లో॥ అపిచేత్సుదురాచారో భజతేమామనన్యభాక్।
సాధురేవసమంతవ్య స్సమ్యగ్వ్యవసితోహిసః॥
౮॥ స్వజీవత్వేనయోవేత్తి మామేవైకమనన్య
ధీః। తంనస్పృశంతిపాపాని బ్రహ్మహత్యాదికా
న్యపి॥ ౯॥

తా॥ దురాచారుండైనను నన్ను భజించెనేని యాతండుసజ్జనుండేయని తెలియుము. యేనరుండైన సర్వజీవగతుండనైయున్న నన్నెఱుంగు నాతని కి బ్రహ్మహత్యాది పాపంబులునులేవు.

శ్లో॥ ఉపాసావిధయస్తత్ర చత్వారస్సముదాహృతాః।
సంపదారోపసంసర్గా ధ్యాసా ఇతిమనీషిభిః॥
౧౦॥ అల్పస్యచాధికత్వేన గుణయోగాద్విచింత
నం। అనంతంవైమనఇతి సంపద్విధిరుదీరితః॥
౧౧॥ విధినారోప్యయావచ్ఛ సఆరోపఃప్రకీర్తి
తః। యద్వదోంకారఉద్గీథ ముపాసీతేత్యుదా
హృతః॥ ౧౨॥ ఆరోపోబుద్ధిపూర్వేణ యఉపా
సావిధిశ్చసః। యోషాగ్నిమతిర్యద్వ దధ్యాస
స్సఉదాహృతః॥ ౧౩॥ క్రియాయోగేనచోపాసా
విధిస్సంసర్గఉచ్యతే॥

తా॥ సంపత్తు, ఆరోపము, సంసర్గము, అధ్యాసము అని యుపాసనవిధులు నాలుగువిధంబులు. అల్పంబు నధికంబుగా మనంబున నెంచుట సంపద్విధిగా జెప్పంబడు. విధిపూర్వకంబుగాజేయుట ఆరోపంబు అది ఓంకారంబును బుద్ధిపూర్వకంబుగా నుపాసింపవలయు. అగ్నిపూజా పూర్వకంబుగా నుపాసించుట అధ్యాసంబండ్రు క్రియాయుక్తంబుగా నుపాసించుట సంసర్గంబండ్రు.

శ్లో॥ సంహృత్యవాయుఃప్రళయె భూతాన్యేకోవసీదతి॥ ౧౪॥ ఉపసంయమ్యబుధ్యాయో పాసనందేవతాత్మనా। తదుపాసనమంతఃస్యా త్తద్బహిఃసంపదాదయః॥ ౧౫॥ జ్ఞానాంతరానంతరిత సజాతిజ్ఞాతిసంతతేః। సంపన్నదేవతాత్మత్వ ముపాసనముదీరితం॥౧౬॥సంపదాదిషుబాహ్యేషు దృఢబుద్ధిరుపాసనం। ఉపాసనమితిప్రోక్తం తదంగానిబ్రువెశ్రుణు॥ ౧౭॥ తీర్థక్షేత్రాదిగమన శ్రద్ధాంతత్రపరిత్యజేత్। స్వచిత్తైకాగ్రతాయత్ర తత్రాసీతసుఖంద్విజః॥ ౧౮॥ కంబళేమృదుతల్పెవా వ్యాఘ్రిచర్మణివాస్థితః। వివిక్తదెశెనియతస్సమగ్రీవాశిరస్తనుః॥ ౧౯॥ అత్యాశ్రమస్థస్సకలానీంద్రియాణినిరుధ్యచ। భక్త్యాథస్వగురూన్నత్వా యోగంవిద్వాన్ప్రయోజయత్॥ ౨౦॥

తా॥ ప్రళయంబుగా వాయువులనణంచి సకలభూతసంయమనంబుజేసి సకలదేవతల నేకరూపంబుగా నుపాసించుట అంతరుపాసనంబు బహిఃప్రదేశంబుల నుపాసించుట సంపదాద్యుపాసనంబులు జ్ఞానంబుచే సకలభూతంబుల నేకంబుగా నెంచుట నాంతరంబండ్రు. బాహ్యప్రదేశంబులదృఢబుద్ధియై నుపాసించుట సంపదాదులండ్రు, వానిలక్షణంబుల నెఱింగించెద వినుము. తీర్థక్షేత్రాదుల శ్రద్ధమాని ఏకాగ్రచిత్తుండై యెచ్చటనైన కంబళి

మీదనైన మృదుతల్పంబుపైనైన వ్యాఘ్రాజినంబుననైన గూర్చుండి వివిక్త దేశంబున శిరంబును గ్రీవంబును దేహంబును సమంబులుగాజేసి అత్యాశ్రమస్థుండై ఇంద్రియంబుల నిరోధించి భక్తిచేసురుపులకలిగి యోగంబభ్యసింపవలయు.

శ్లో॥ యస్తువిజ్ఞానవాన్భవతి యుక్తేనమనసా సదా ।
తస్యేంద్రియాణి వశ్యాని సదశ్వాఇవసారథేః॥
౨౧॥ యస్త్వవిజ్ఞానవాన్భవత్యయుక్తమనసా
సదా । తస్యేంద్రియాణ్యవశ్యాని దుష్టాశ్వాఇ
వసారథేః॥ ౨౨॥ యస్తువిజ్ఞానవాన్భవతి అమన
స్కస్సదాశుచిః । సతుతత్పదమాప్నోతి యస్మా
ద్భూయోనజాయతే॥ ౨౩॥

తా॥ విజ్ఞానంబుగలవానికి ఇంద్రియంబులు సదశ్వంబులుసారథికివశ్యంబులగునట్లు స్వాధీనంబులగు. యేనరుండైన జ్ఞానహీనుండైమనోనిగ్రహంబు లేకనుండు నాతనికింద్రియంబులు దుష్టాశ్వంబులు సారథికింబోలె వశ్యంబులుగావు. యేనరుండైన జ్ఞానంబుచే అమనస్కుండు శుచియునగు నాతండు జన్మంబులేని పదంబునొందు.

శ్లో॥ విజ్ఞానసారథిర్యస్తు మనఃప్రగ్రహవానవచ । సోధ్వ
నఃపారమాప్నోతి మమైవపరమంపదం॥ ౨౪॥

తా॥ యేనరునికి విజ్ఞానంబు సారథియు మనంబు పగ్గంబుగానుండు నతండు పరమపదంబుజేరు.

శ్లో॥ హృత్పుండరీకంవిరజం విశుద్ధంవిశదంసదా । వి
శోధకంవిచింత్యాత్ర ధ్యాయేన్మాం పరమేశ్వరం॥
౨౫॥ అచింత్యరూపమవ్యక్త మనంతమమృతం
శివం । ఆదిమధ్యాంతరహితం ప్రశాంతంబ్రహ్మ
కారణం॥ ౨౬॥ ఏవంవిభుంచిదానంద మరూ
పమజమద్భుతం । శుద్ధస్ఫటికసంకాశ ముమా
దేహార్ధధారిణం॥ ౨౭॥ వ్యాఘ్రచర్మాంబరధరం

నీలకంఠంత్రిలోచనం । జటాధరంచంద్రమౌళిం
నాగయజ్ఞోపవీతినం॥ ౨౮॥

తా॥ హృత్పుండరీకవాసియుం విశుద్ధుండును విశదుండునుపరమేశ్వరుండును అచింత్యరూపియుం అనంతుండమృతుండు శివుండాదిమధ్యాంతరహితుండు ప్రశాంతుండు బ్రహ్మకారణుండును, విభుండును చిత్స్వరూపియు ఆనందమయుండు డద్భుతుండును శుద్ధస్ఫటికసదృశదేహుండు ఉమాదేహార్ధధారియు వ్యాఘ్రచర్మవసనుండును నీలకంఠుండును త్రిలోచనుండును జటాధారియు చంద్రమౌళియు సర్పంబుల ధరించినవాడును,

శ్లో॥ వ్యాఘ్రచర్మోత్తరీయం చవరేణ్యమభయప్రదం।
పరాభూర్యమూర్ధ్వహస్తాభ్యాం బిభ్రాణంపర
శుంమృగం॥ ౨౯॥ కోటిమధ్యాహ్నసూర్యాభం
చంద్రకోటిసుశీతలం । చంద్రసూర్యాగ్నినయ
నం స్మేరవక్త్రసరోరుహం॥ ౩౦॥ భూతిభూషిత
సర్వాంగం సర్వాభరణభూషితం । ఏవమా
మరణింకృత్వా ప్రణవంచోత్తరారణిం । జ్ఞాన
నిర్మథనాభ్యాసాత్సాక్షాత్పశ్యతిమాంజనః॥౩౧॥

తా॥ వరేణ్యుండభయప్రదాతయు, పరశుమృగధారియు, కోటిసూర్యప్రకాశుండును, చంద్రకోటిశీతలుండును, చంద్రసూర్యాగ్నినేత్రుండును, స్మేరవక్త్రారవిందుండును, భూతిభూషితసర్వాంగుండును, సకలభూషణధారియునైప్రకాశించు నన్నరణింగాఁజేసి ప్రణవంబుత్తరారణింగావించి జ్ఞానంబుచే మథనంబుగావించి జనుండు నన్నుంగాంచు.

శ్లో॥ వేదవాక్యైకలభ్యోహం నశాస్త్రైర్నాపిచేతసా।
ధ్యానేనవృణుతేయేమాం సర్వదాహంవృణో
మితాన్॥ ౩౨॥

తా॥ నేవేదవాక్యంబులచే లభ్యుండగాని శాస్త్రంబులకు మనంబునకగోచరుండ యేనరులు నన్నుధ్యానించుచుందురో వారికినే గానంబడుదు,

శ్లో॥ నావిరక్తోదుశ్చరితో నాశాంతో నాసమీహితః।
నాశాంతమానసోవాపి ప్రజ్ఞానేనలభేతమాం ॥
జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రపంచోయఃప్రకాశ
తే।తద్బ్రహ్మాహమితిజ్ఞాత్వాసర్వబంధైఃప్రముచ్యతే॥ ౩౮॥

తా॥ విరక్తింబొందక దుశ్చరితుండై శాంతిలేకనున్నవాఁడైన జ్ఞానంబు చెనన్నుంబొందు నరుఁడు జాగ్రత్స్వప్న సుషుప్త్యాదులంగూడియున్న ప్రపంచంబెల్ల నారూపంబని యెరింగెనేని సకలబంధవిముక్తుండగు.

శ్లో॥ త్రిషుధామసుయద్భోజ్యం భోక్తాభోగశ్చయద్భ
వేత్॥ ౩౯॥ తేభ్యోవిలక్షణస్సాక్షీ చిన్మాత్రో
హంసదాశివః॥ ౪౦॥

తా॥ భోజ్యంబులు భోక్తయు భోగంబును మొదలగువానికి విలక్షణుండై సాక్షినై చిన్మాత్రుండనై శివస్వరూపుండనైయుందు.

శ్లో॥ ఏకోదేవస్సర్వభూతేషు గూఢస్సర్వవ్యాపీసర్వ
భూతాంతరాత్మా । సర్వాధ్యక్షస్సర్వభూతాధి
వాసస్సాక్షీచేతాః కేవలో నిర్గుణోహం॥ ౪౧॥
ఏకోదేవః సర్వభూతాం తరాత్మాఏకంబీజం బ
హుధాయఃకరోతి । తంమాంనిత్యం యేనుప
శ్యంతి ధీరాస్తేషాం శాంతిశ్శాశ్వతీనేతరేషాం
౪౨॥ అగ్నిర్యథైకోభువనం ప్రవిష్టోరూపంరూ
పం ప్రతిరూపోబభూవ । ఏకస్తథాసర్వభూతాం
తరాత్మానలిప్యతే లోకదుఃఖేనబాహ్యః ॥౪౩॥

తా॥ నేనొకండ సకలభూతనివాసినై గూఢుండనై సర్వవ్యాపకుండనై సర్వాధ్యక్షుండనై సర్వసాక్షినై నిర్గుణుండనైయుందు బీజం బొకటియయ్యు ననేకవిధంబులైనట్లు నేనొకండ సకలభూతరూపంబుల నొందుదు శాశ్వతుండనైన నన్నెరుంగువారికి శాంతిగలుగునితరులకుంగలగదు అగ్ని యొకటియైనను సకలలోకంబుల బహురూపంబు లొందునట్లు నేనొకండనైయును సకలభూతరూపధారినై లోకదుఃఖ బాహ్యుండనగుదు.

శ్లో॥ వేదాహమేతం పురుషం మహాంత మాదిత్యవర్ణం తమ
సః పరస్తాత్ । స ఏవం విద్వానమృతో౽త్ర భూయా
న్నాన్యస్సుపంథా అయనాయ విద్యతే॥ ౩౯॥

తా॥ ఏనరుండైన మహాపురుషుండు ఆదిత్యరూపుండు తమఃపరుండైన నన్నెరుంగువాడు అమృతత్వంబునొందు మరియొకమార్గంబులేదు.

శ్లో॥ హైరణ్యగర్భం విదధాతి పూర్వం వేదాంశ్చ తస్మై
ప్రహిణోమి యో౽హం । తం దేవమీడ్యం పురు
షం పురాణం నిశ్చిత్య మాం మృత్యుముఖాత్ప్రము
చ్యతే॥ ౪౦॥ ఏవం శాంత్యాదియుక్తస్సన్వేత్తి
మాం మత్పరస్తు యః । నిర్ముక్త దుఃఖసంతాన
స్సాంతే మయ్యేవ లీయతే॥ ౪౧॥

తా॥ నే పూర్వంబున నలువను సృజించి వానికి వేదంబుల నొసంగితి. ఈడ్యుండు పురాణపురుషుండైన నన్నెఱుంగువాడు మృత్యుభయంబునొందడు యేనరుండైన శాంతినొంది నన్నెఱుంగువాడు సకల దుఃఖంబులవాసి యంతంబున నన్నుంజేరునని శివుండు శ్రీరామున కెఱింగించెను.

ఇతి శ్రీపద్మపురాణే.

శ్రీమచ్ఛివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శివరాఘవసంవాదే ఉపాసనవిధి
ర్నామ ద్వాదశో౽ధ్యాయః.

ఇది పద్మపురాణంబున శ్రీకరంబై యుపనిషద్రూపమైనదియు పరబ్రహ్మ
విద్యయైనట్టి శివగీతలనెడు యోగశాస్త్రంబున శివరాఘవ
సంవాద రూపంబైన ఉపాసన విధియను పండ్రెం
డవయధ్యాయము ముగిసెను.

## త్రయోదశోధ్యాయః.

శ్లో॥ ఏవంశ్రుత్వాకౌసలేయ స్తుష్టోమతిమతాంవరః।
ప్రప్రచ్ఛగిరిజాకాంతం సుభగంముక్తిలక్షణం॥ ౧॥

తా॥ బుద్ధిమంతుండైన శ్రీరామచంద్రుండు ప్రీతుండగుచు పార్వతీనాయకుండైన పరమేశ్వరుని ముక్తిలక్షణం బడుగుచున్నాడు.

శ్రీరామ ఉవాచ.

శ్లో॥ భగవన్కరుణావిష్ట హృదయత్వంప్రసీదమె।
స్వరూపలక్షణంముక్తేః ప్రబ్రూహిపరమేశ్వర॥ ౨॥

తా॥ ఓదేవదేవా కరుణామయహృదయా ముక్తిలక్షణంబెట్లు దాని నెరుంగింపుమనిన సదాశివుండు చెప్పుచున్నాడు.

శ్రీ భగవానువాచ.

శ్లో॥ సాలోక్యంచాపిసారూప్యం సార్ష్టింసాయుజ్యమేవచ। కైవల్యంచేతితాంవిద్ధి ముక్తింరాఘవ పంచధా॥ 3॥

తా॥ ఓ.రామచంద్రా వినుము సాలోక్యంబు సారూప్యంబు సార్ష్టియు సాయుజ్యంబు కైవల్యంబుఆని ముక్తి యైదువిధంబులు.

శ్లో॥ మాంపూజయతినిష్కామ స్సర్వదాజ్ఞానవర్జితః। సమేలోకంసమాసాద్య భుంక్తేభోగాస్యథేప్సితా॥ ౪॥ జ్ఞాత్వామాంపూజయేద్యస్తు సర్వకామవివర్జితః। మయాసమానరూపస్స న్మమలోకేమహీయతే॥ ౫॥

తా॥ ఏనరుండైన కామంబులేక అజ్ఞానంబువిడిచి నన్నుంబూజించునతండు నాలోకంబుజేరి తాగోరిన భోగంబుల ననుభవించు. ఏనరుండైననన్నెరింగి కామంబులవిడిచి పూజించునో యాతండు నాలోకంబున నాస్వరూపంబునొంది విహరించు.

శ్లో ॥ ఇష్టాపూర్తానికర్మాణి మత్ప్రీత్యైకురుతేతుయః।
యత్కరోతియదశ్నాతి యజ్జుహోతిదదాతియ
త్॥ ౭॥ యత్తపస్యతితత్సర్వం యఃకరోతిమద
ర్పణం। మల్లోకేసఃశ్రియంభుంక్తే మత్తుల్యా
ప్రాభవంభజన్॥ ౮॥

తా॥ ఏనరుండైన నాప్రీతికై ఇష్టాపూర్తాదికర్మంబుల మరియు నేసే కర్మంబుల నేయేహోమంబుల దానంబుల దపంబుల మదర్పణంబుగాఁజేయు నాతండు మదీయలోకంబున నాతో సమానుండై సకలభోగంబు లనుభవించు.

శ్లో॥ యస్తుశాంత్యాదియుక్తస్సన్ మామాత్మత్వేన
పశ్యతి॥ సజాయతేపరంజ్యోతి రద్వైతంబ్రహ్మ
కేవలం॥ ౯॥ సర్వధర్మవిహీనంచ తస్మాద్వాచా
మగోచరం। సజాతీయవిజాతీయ పదార్థానా
మసంభవాత్॥ ౯॥ అతస్తద్వ్యతిరిక్తానామద్వై
తమితిసంజ్ఞితం। మత్స్వరూపమిదంరామ శుద్ధం
యదభిధీయతే॥ ౧౦॥ మయ్యేవదృశ్యతేసర్వం
జగత్థాస్నవరజగమం। వ్యోమ్నిగంధర్వనగరం
యథాదృష్టంనదృశ్యతే॥ ౧౧॥ అనాద్యవిద్యయా
విశ్వం సర్వంమయ్యేవకల్ప్యతే। నివర్తతేతుమ
య్యేవ మయ్యేవేదంవిలీయతే॥ ౧౨॥

తా॥ ఏనరుండైన శాంతినొంది ఆత్మరూపుండై నన్నెఱుంగునోయతండు పరంజ్యోతియై యద్వైతంబైనబ్రహ్మంబేరు, సర్వధర్మంబులులేకవాక్కులకగోచరుండనై సజాతి విజాతులులేక నేనుండుగాన నద్వైతరూపుండ ఇట్టినారూపంబు పరిశుద్ధంబైయుండు స్థావరజంగమాత్మకంబులైన జగంబులెల్ల నాకాశంబుననుండు గంధర్వలోకంబునుంబోలె అవిద్యాయుక్తంబై నాయందనుండు వృద్ధినొందు లీనంబులునగు.

శ్లో ॥ మమస్వరూపజ్ఞానేన యదావిద్యాప్రణశ్యతి। త
దైకఏవవర్తేహంమనోవాచామగోచరః॥ ౧౩॥

తదైవపరమానందః స్వప్రకాశశ్చిదాత్మకః । న
కాలఃపంచభూతాని నదిశోవిదిశశ్చన॥ ౧౪॥
మదన్యంనాస్తియత్కించిత్తదావర్తేహమేవవా॥
౧౫॥ నసంధృశేతిష్ఠతిమె స్వరూపంనచక్షుసా
పశ్యతిమాంతుకశ్చిత్ । హృదామనీషామనసా
భిక్లప్తంమెమాంవిదుస్తే హ్యమృతాభవంతి॥౧౬॥

తా॥ నాస్వరూపజ్ఞానంబు గలవానికి నీకరూపుండనై వాగగోచరుండనై పరమానందరూపుండనై స్వప్రకాశుండ చిదాత్మకుండనై యుందు, కాలంబు పంచభూతంబులు దిక్కులు విదిక్కులు ఇవియెల్ల నాకన్యంబులుగావు నీనరుండును నారూపంబును కనులజూడనేరండు, మనంబున బుద్ధిచే నన్నెఱుంగువారల మృతరూపులగుదురు అనిన,

శ్రీరామ ఉవాచ.

శ్లో॥ కథంభగవతోజ్ఞానంశుద్ధంమర్త్యస్యజాయతే।త
త్రోపాయంహరబ్రూహిమయితేనుగ్రహోయది॥౧౭॥

శ్రీరాముం డిట్లనియె.

తా॥ ఓమహాత్మా నాయందు నీకనుగ్రహంబుగలదేని మనుజుండెట్లు శుద్ధజ్ఞానంబునొందు, దానికిందగు నుపాయం బెఱుంగింపుమనిన.

శ్రీ భగవానువాచ.

శ్లో॥ విరజ్యసర్వభూతేభ్యఆవిరించిపదాదపి। ఘృణాం
వితత్యసర్వస్మిన్ పుత్రమిత్రాదికేష్వపి॥ ౧౮॥
శ్రద్ధాభుర్ముక్తిమార్గేణ వేదాంతజ్ఞానలీప్సయా ।
ఉపాయనకరోభూత్వా గురుంబ్రహ్మావిదంవ్రజే
త్ ॥ ౧౯॥ సేవాభిఃపరితోష్యైనం చిరకాలం
సమాహితః। సర్వవేదాంతవాక్యార్థాం చ్ఛృణు
యాత్సుసమాహితః। సర్వవేదాంతవాక్యానాం
మయితాత్పర్యనిశ్చయః॥ ౨౦॥ శ్రవణంనామ

తత్పాపిహు స్సర్వే తేబ్రహ్మవాదినః । లోహమ
ణ్యాదిదృష్టాంత యుక్తిభిర్యద్విచింతనం॥ ౨౧॥
తదేవమననంప్రాహు ర్వాక్యార్థస్యోపబృంహ
ణం। నిర్మోహోనిరహంకారస్సర్వసంగవివర్జి
తః॥ ౨౨॥ సదాశాంత్యాదియుక్తస్స న్నాత్మ
న్యాత్మానమీక్షతే । యత్సదాధ్యానయోగేన
తన్నిధిధ్యాసనంమతం॥ ౨౩॥

సదాశివుం డిట్లనియె.

తా॥ ఓరామచంద్రా ! నరుండు విరక్తుండై బ్రహ్మాది సకలభూతంబుల యందు దయగలిగి, పుత్రమిత్రాదులవిడిచి శ్రద్ధగలిగి వేదాంతజ్ఞానంబుగోరి ఉపాయనంబుగొని బ్రహ్మవేత్తయైన గురుంజేరి వానిపరిచర్యల సంతుష్టుంగావించి సమాహితుండై చిరకాలంబుండి సర్వవేదవాక్యార్థం - బాతనిచే వినవలయు అదివినుట శ్రవణంబనంబరగు అట్లు వినువారలు బ్రహ్మవాదులు లోహమణ్యాది దృష్టాంతయుక్తుల చింతించుట మననంబండ్రు, వాక్యార్థంబులవినుచు నిర్మోహుండై నిరహంకారుండై సర్వసంగంబుల విడిచి శాంతిగలిగి, ధ్యానయోగంబున నాత్మంగాంచుట నిధిధ్యాసనంబండ్రు.

శ్లో॥ సర్వకర్మక్షయవశాత్సాక్షాత్కారోపిచాత్మనః।
కస్యచిజ్జాయతేశీఘ్రంచిరకాలేనకస్యచిత్ ॥ ౨౪॥

తా॥ సర్వకర్మక్షయంబుచే గొందరికి శీఘ్రంబుననే ముక్తిగలుగు గొందరికి చిరకాలంబునంగల్గు.

శ్లో ॥ కూటస్థానిచకర్మాణి కోటిజన్మార్జితాన్యపి । జ్ఞానే
నైవవినశ్యంతి నతుకర్మాయుతైరపి॥ ౨౫॥ జ్ఞా
నాదూర్ధ్వంచయత్కించి త్పుణ్యంవాపాపమే
వవా । క్రియతేబహువాస్వల్పం నతేనాయంవి
లిప్యతే॥ ౨౬॥ శరీరారంభకంయత్తు ప్రారబ్ధం
కర్మతన్మతం । తద్భోగేనైవనష్టంస్యా న్నతుజ్ఞా
నేననశ్యతి॥ ౨౭॥

తా॥ కోటిజన్మార్జితంబులైన కూటస్థకర్మంబు లెన్ని సుకర్మంబులజేసి ననుంబోవు. అవి జ్ఞానంబున నశించును జ్ఞానంబుకన్న పుణ్యపాపంబులు ఎన్ని జేసినను వానిచే విలీనంబుగాదు శరీరారంభకంబైన ప్రారబ్ధకర్మంబు అనుభవించినంగాని జ్ఞానంబుచేతను నశించదు.

శ్లో॥ నిర్మోహో నిరహంకారో నిర్లేపస్సంగవర్జితః।
సర్వభూతేషుచాత్మానం సర్వభూతానిచాత్మని॥
౨౮॥ యఃపశ్యన్ సంచరత్యేష జీవన్ముక్తోభిధీయ
తే। అహింనిర్లయనీయద్వద్దృష్టిస్సర్వమతిప్రదా॥
౨౯॥ తస్యాపినాంతరంకించి త్తద్వద్రష్టురయం
జనః। యదాసర్వేప్రముచ్యంతే కామాయెస్య
హృదిస్థితాః॥ ౩౦॥ అథమర్త్యోమృతోభవత్య
త్రబ్రహ్మసమశ్నుతే। యదాసర్వేప్రభిద్యంతే
హృదయస్యేవగ్రంధయః॥ ౩౧॥ అథమర్త్యో
మృతోభవత్యేతావదనుశాసనం। మోక్షస్య
నహివాసోస్తి నగ్రామాంతరమేవవా॥ ౩౨॥ అ
జ్ఞానహృదయగ్రంథేర్నాశోమోక్షఇతిస్మృతః।
వృక్షాగ్రాచ్చ్యుతపాదో యస్సర్వాఖైవపతత్యధః॥
౩౩॥ తద్వత్ జ్ఞానవతోముక్తిర్జాయతేనిశ్చయా
పితు। తీర్థేచండాలగెహెవా యదివానష్టచేత
నః॥ ౩౪॥ పరిత్యజన్ స్వకందేహం జ్ఞానాదేవవి
ముచ్యతే। సంవిదాయేనకేనాశ్నన్ భక్ష్యంవా
భక్ష్యమేవవా॥ ౩౫॥ శయానోయత్రకుత్రాపి
సర్వాత్మాపివిముచ్యతే। క్షీరాదుద్ధృతమాజ్యం
యత్క్షిప్తంపయసియత్పునః॥ ౩౬॥ సతేనస్తైక
తామేతి సంసారీజ్ఞానవాంస్తథా॥ ౩౭॥ నిత్యం
పఠతియోధ్యాయ మిమంరామశృణోతివా। స

ముచ్యతే దేహాబాధా దనాయాసేనరాఘవ॥ ౩౭॥ అత స్త్వంయతచిత్తస్సన్ నిత్యంపఠమహీపతే అనాయాసేన తేనైవ సర్వదామోక్షమాప్స్యసి॥

తా॥ నిర్మోహుండు నిరహంకారుండై సర్వసంగంబులవిడిచిసర్వభూతవాసియై యెవ్వండుసంచరించు నాతండు జీవన్ముక్తుండనంబరగు సర్పంబు బుసవిడుచునట్లు నరుండు దనశరీరంబువిడుచు, ఏనరునికి కామంబులెల్లవిడుచునో అతండు మృతిలేక బ్రహ్మమయుండగు నెప్పుడు నరునకు మనంబున సకలసంశయంబులు నశించునో పిమ్మట నతండమృతుండైవెలయు. మోక్షంబునకు వాసంబు గ్రామంబేదియునులేదు. అజ్ఞానగ్రంధి నాశనంబే మోక్షంబంద్రు వృక్షాగ్రంబందుండి నేలంబడునట్లు అజ్ఞానంబువిడిచిన ముక్తిగలుగు నిది నిశ్చయంబు సత్ క్షేత్రంబునంగాని చండాలునింటంగాని నరుండు జ్ఞానంబున దేహంబువిడిచెనేని ముక్తింబొందు. నరుండు భక్ష్యంబైన నభక్ష్యంబైన భుజించుచు, నెచ్చటనైన శయనించుచు జ్ఞానంబున ముక్తుండగు క్షీరంబంగుండి ఉద్ధృతంబైన ఘృతంబు మరలదానింజేర నట్లు సంసారియు జ్ఞానవంతుండయ్యెని మరల సంసారిగాడు. ఓరామచంద్రా యేనరుండైన నీయధ్యాయంబును నిత్యంబుపఠించునో యతండు ముక్తుండగుగాన నీవును దీనింబఠింపుము. అనాయాసంబున మోక్షంబునొందెదవని సదాశివుండు శ్రీరాముని కెఱింగించెను.

ఇతి శ్రీపద్మపురాణే.

శ్రీమచ్ఛివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శివరాఘవసంవాదే—మోక్షయోగో నామ త్రయోదశోధ్యాయః.

ఇది పద్మపురాణంబున శ్రీకరంబై యుపనిషద్రూపమైనదియు పరబ్రహ్మ విద్యయైనట్టి శివగీతలనెడు యోగశాస్త్రంబున శివరాఘవ సంవాదరూపంబైన మోక్షయోగంబను పదమూడవ యధ్యాయము ముగిసెను.

## చతుర్దశోఽధ్యాయః.

శ్రీరామ ఉవాచ.

శ్లో॥ భగవన్యది తేరూపం సచ్చిదానందవిగ్రహం । నిష్కళంనిష్క్రియంశాంతం నిరవద్యంనిరంజనం॥ ౧॥ సర్వధర్మవిహీనంచ మనోవాచామగోచరం । సర్వవ్యాపినమాత్మానం క్షీరేసర్పిరివార్పితం॥ ౨॥ ఆత్మవిద్యాతపోమూలం తద్బ్రహ్మోపనిషత్పరం । అమూర్తంసర్వభూతస్థం కార్యకారణకారణం॥ ౩॥ యత్తచ్చాదృశ్యమగ్రాహ్యం తద్గ్రాహ్యంవాకథంభవేత్ । అత్రోపాయమజానానస్తేనఖిన్నోస్మి శంకర॥ ౪॥

శ్రీరాముండు చెప్పుచున్నాఁడు.

తా॥ ఓ దేవదేవా నీరూపంబు సచ్చిదానందమయంబు నిష్కళంబు నిష్క్రియంబు శాంతంబు నిరవద్యంబు నిరంజనంబు మనోవాగగోచరంబు సర్వవ్యాపియు ఆత్మరూపియునై క్షీరంబందున్న ఘృతంబుచందంబున ఆత్మవిద్యాతపోమూలంబై బ్రహ్మయు ఉపనిషత్పరంబు అమూర్తంబు పంచభూతస్థితంబు కార్యకారణంబు అదృశ్యంబు అగ్రాహ్యంబైయున్న దదిరీతుల్లు గ్రాహ్యంబగు దానికుపాయం బెఱుంగకనే ఖిన్నుండనైయున్నవాఁడ.

శ్రీభగవానువాచ.

శ్లో॥ శృణురామప్రవక్ష్యామి తత్రోపాయంమహాభుజ । సగుణోపాసనాభిస్తు చిత్తైకాగ్ర్యంవిధాయచ॥ ౫॥ స్థూలారుంధతికన్యాయా స్తత్రచిత్తంప్రవర్తయేత్ । అస్మిన్నంనమయేపిండే స్థూలదేహాతనూభృతాం॥ ౬॥ జన్మవ్యాధిజరామృత్యు

నిలమెవర్త తేదృథా । ఆత్మబుద్ధిరహంమానా త్కఢాచిన్నైవహీయతే॥ ౭॥ ఆత్మానజాయతే నిత్యో మ్రియతేవాకథంచన । నజాయతేస్తి విపరిణమతేవర్ధతేపిచ॥ ౮॥ క్షీయతెవర్ధతీత్యేతె షడ్భావావపుషస్స్మృతాః । ఆత్మనోనవికారిత్వం ఘటస్థనభసోయథా॥ ౯॥

ఈశ్వరుండు చెప్పచున్నాడు.

తా॥ ఓరామచంద్రా వినుము దానికిందగనుపాయం బెరుంగించెద సగుణోపాసనాదుల మనం బేకాగ్రంబుగాఁజేసి స్థూలంబైన యరుంధతీకన్యాయుండు మనంబు ప్రవర్తింపంజేసి అన్నమయపిండంబున జన్మమృత్యుజరావ్యాధినిలయంబైన దేహంబునందు బుద్ధి అహంకారంబుచే లీనంబగుపరమాత్మ యెన్నటికి నశించదు జాతంబునుగాదు పరిణమింపదు వృద్ధినొందదు. శరీరభావంబులారును వృద్ధింబొందు నశించు ఆత్మకు, ఘటస్థితంబైన యాకాశంబునకుంబోలె వికారంబులులేవు.

శ్లో॥ నేదమాత్మావపుస్తస్మా దితిసంచింతయెద్బుధః । మూషానిక్షిప్తహేమాంభః కోశఃప్రాణమయెత్రతు॥ ౧౦॥ వర్తతెంతరతోదేహె బద్ధఃప్రాణాదివాయుభిః । కర్మేంద్రియైస్సమాయుక్త శ్చలనాది క్రియాత్మకః॥ ౧౧॥ క్షుత్పిపాసాపరోభూత్వా నాయమాత్మాజరోయతః। చిద్రూపఆత్మా యెనైవ సందేహమభిపశ్యతి ॥ ౧౨.॥ ఆత్మైవాహంపరంబ్రహ్మ నిర్లేపస్సుఖనీరధిః । నతదశ్నాతి కించైనం నతదశ్నాతికశ్చన॥ ౧౩॥

తా॥ పండితుం డీశరీరం బాత్మగాదనిదలంచు మూషాక్షిప్తంబైన స్వర్ణజలంబురీతి ప్రాణకోశంబు ప్రాణాదివాయువులంగూడి దేహంబుననుండుచు కర్మేంద్రియంబులతోగూడి చలనంబులజేయుచు క్షుత్పిపాసాయుతంబైయుం

డుయిది యాత్మగాదు. ఆత్మ చిద్రూపంబై దేహంబుననుండు. ఆత్మ పరబ్రహ్మరూపంబు నిర్లేపంబు సుఖసాగరంబైయుండు అదిదేని నిభుజించదు.

శ్లో ॥ తత్రప్రాణమయేకోశేకోశోస్త్యేవంమనోమయః।
ససంకల్పవికల్పాత్మా బుద్ధీంద్రియసమాయుతః॥
౧౪॥ కామఃక్రోధస్తథాలోభో। మోహోమాత్సర్యమేవచ । మదశ్చేత్యరిషడ్వర్గో మమతేచ్ఛాదయోపిచ॥ ౧౫॥ మనోమయస్యకోశస్యధర్మావతేస్యురత్రతు । యాకర్మవిషయాబుద్ధిర్వేదశాస్త్రార్థనిశ్చితా ॥ ౧౬ ॥ సాతుజ్ఞానేంద్రియైస్సార్థం విజ్ఞానమయకోశగా । ఇహకర్తృత్వాభిమానీచ సఏవతునసంశయః॥ ౧౭॥ ఇహాముత్రగతిస్తస్య సజీవోవ్యావహారికః। వ్యోమాదిసాత్వికాంశే భ్యోజాయంతే చేంద్రియాణితు॥ ౧౮॥ వ్యోమ్నఃశ్రోత్రంభువోఘ్రాణం జలాజ్జిహ్వాపి తేజసః। చక్షుర్వాయోస్త్వగుత్పన్నా తేషాంభౌతికతాతతః ॥ ౧౯ ॥ వ్యోమాదీనాం సమస్తానాం సాత్వికాంశేభ్యఏవతు। జాయంతే బుద్ధిమనసీబుద్ధిఃస్యాన్నిశ్చయాత్మికా॥ ౨౦॥ వాక్పాణిపాదపాయూప స్థానికర్మేంద్రియాణితు । వ్యోమాదీనాంరజోంశేభ్యః పంచప్రాణాదివాయవః॥ ౨౧॥ జాయంతేసప్తదశకమేవంలింగశరీరకం। ఏతల్లింగశరీరంతు తప్తాయఃపిండవద్యతః॥ ౨౨॥ పరస్పరాభ్యాసయోగాత్సాక్షాచ్చైచతన్యసంయుతః। తదానందమయఃకోశో భోక్తృత్వప్రతిపద్యతే॥ ౨౩॥ విద్యాకర్మఫలాదీనాం

భోక్తైహాముత్రసంస్మృతః । యదధ్యాసంవిహా
యైషః స్వస్వరూపేణతిష్టతి॥ ౨౮॥

తా॥ ఆ ప్రాణమయకోశంబున మనోమయకోశం బొందుగలదు. అది సంకల్ప వికల్పరూపంబై బుద్ధీంద్రియాదులం గూడియుండు కామంబు క్రోధంబు లోభ మోహ మదమాత్సర్యంబు లరిషడ్వర్గంబులు మమత్వంబిచ్ఛయు ఇవియెల్ల మనోమయకోశంబునకు ధర్మంబులు కర్మవిషయంబై వేదశాస్త్రార్థయుతంబైన బుద్ధి జ్ఞానేంద్రియంబులంగూడి విజ్ఞానమయ కోశంబుననుండు దేహంబున వ్యావహారిక జీవుండు కర్తృత్వాభిమానియైయుండు వ్యోమాదుల సాత్వికాంశంబులవలన యింద్రియంబులుగలుగు. ఆకాశంబువలన శ్రోత్రంబు, భూమివలన ఘ్రాణంబు, జలంబువలన జిహ్వయు తేజంబువలన నేత్రంబులు, వాయువువలన చర్మంబుగానిట్లు భౌతికంబులుగాగల్గు వానికాబుద్ధి నిశ్చయాత్మకంబగు, వాక్పాణి పాదపాయూపస్థలైదు కర్మేంద్రియంబులు వ్యోమాదుల రజోంశంబున పంచప్రాణాదులుగలుగు ఇట్లు సప్తదశాత్మకంబై లింగశరీరంబుండు తప్తాయఃపిండంబురీతి పరస్పరాధ్యాస యోగంబున చైతన్యసంయుతంబై ఆనందమయకోశంబు విద్యాకర్మఫలంబులకు భోక్తయై అధ్యాసంబులేక స్వస్వరూపంబుననుండు.

శ్లో॥ అవిద్యామాత్రసంయుక్తః సాక్ష్యాత్మాజాయతే
తదా। ద్రష్టాంతఃకరణాదీనా మనుభూతస్మృతే
రపి॥ ౨౯॥ అతోంతఃకరణాద్యస్మా దధ్యస్తత్వేన
చాత్మనః। భోక్తృత్వంసాక్షితా చేతి ద్వైవిధంత
స్యోపపద్యతే॥ ౩౦॥ అతఃపశ్చాచ్చతచ్ఛాయా
అహ్న్యకాశేవిగాజతె । ఏకోభోజయితాతత్ర
భుంక్తేన్యఃకర్మణాంఫలం॥ ౩౧॥ క్షేత్రజ్ఞంరథినం
విద్ధి శరీరంరథ మేవతం। బుద్ధించసారథింవిద్ధి ప్ర
గ్రహంచమనస్తథా॥ ౩౨॥ ఇంద్రియాణి హ
యాన్విద్ధి విషయాంస్తేషుగోచరాన్। ఇంద్రియై
ర్మనసాయుక్తం భోక్తారంవిద్ధిపూరుషం॥ ౩౩॥
ఏవంశాంత్యాదియుక్తస్స న్నుపాస్తే యస్సదా

ద్విజః। ఉద్ఘాట్యోద్ఘాట్య్యైక మేకంయద్వ్యవంకదళీ తరోః॥ ౩౦॥ తల్లలానితతఃపశ్చా ల్లభ తేసార ముత్తమం। తథైవపంచకోశేషు మనస్సంక్రా మయేత్క్రమాత్॥ ౩౧॥ తేషాంమధ్యేతతస్సా రమాత్మానమపివిందతి। ఎవంమనస్సమాధాయ సంయతోమనసాద్విజః॥ ౩౨॥ అధప్రవర్తయె చ్చిత్తం నిరాకారెపరాత్మని। అతోమనఃప్రగృ హ్ణాతి పరమాత్మానమేకలం॥ ౩౩॥ యత్తత్తదేక మగ్రాహ్య మస్థూలాద్యుక్తిగోచరం॥ ౩౪

తా॥ అవిద్యతోఁగూడి ఆత్మసాక్షియై అంతఃకరణాదుల కద్రష్టయైస్ఫృతి కనుభూతంబై అంతఃకరణాదులకు అధ్యక్షత్వంబుచేత భోక్తృత్వ సాక్షిత్వం బులనొందు. దాసిథాయ అహ్నైకాశంబున రెండువిహంబులవెలుఁగు నం దొకటి భుజింపజేయునదియు ఒకటి భుజించునదియుగానుండు, శరీరంబను రథంబున క్షేత్రజ్ఞుండుండు ఆతనికిబుద్ధిసారధిగానుండు మనంబు పగ్గంబగు ఇంద్రియంబులు విషయగోచరంబులై యశ్వంబులై యుండు యింద్రియమనం బులఁగూడి పరమపురుషుండు భోక్తయై వెలయు. ఇట్లు శాంత్యాదులంగూడి యేద్విజుండు ఉపాసించుచు కదళీవనంబును పెకలించిపెకలించి సారంబు గనినరీతిని పంచకోశంబుల మనంబు సంక్రమింపంజేయవలయు అట్లుజేసిన పరమాత్మంగాంచు, నరుండిట్లు మనంబును స్వాధీనంబు గావించికొని నిరాకా రంబైన పరమాత్మయందుంచి యుక్తిసాధ్యంబు స్థూలంబైనఆత్మంగాంచుననిన శ్రీరాముం డిట్లనియె.

శ్రీరామ ఉవాచ.

శ్లో॥ భగవన్ శ్రవణెనైవ ప్రవర్తంతేజనాఃకథం। వేద శాస్త్రార్ధసంపన్నా యజ్వానఃసత్యవాదినః॥ ౩౫॥ శృణ్వంతోపితథాత్మానం జానంతేనైవ కేచన। జ్ఞాత్వాపిమన్యతేమిథ్యాకిమేతత్తవమాయయా॥ ౩౬॥

తా॥ ఓదేవదేవా జనంబులు శ్రవణంబుచేత నెట్లుతరింతురు వేదశా స్త్రార్థంబులెరింగియు యజ్వులై సత్యవాదులైనవారైనను శ్రవణమాత్రంబున

కొందరు పరమాత్మ నెరుంగుదురు కొందఱెఱుంగంజాలరు. అట్లెఱింగియు నీ మాయచే మిథ్యగానెంతురు అనిన,

శ్రీభగవానువాచ.

శ్లో॥ ఏవమేవమహాబాహో నాత్ర కార్యావిచారణా। దైవీహ్యేషాగుణమయీ మమమాయాదురత్య యా॥ ౩౬॥ మామేవయేప్రపద్యంతేమాయా మేతాంతరంతి తే॥ ౩౭॥

సదాశివుం డిట్లనియె.

తా॥ ఓరామా ఇందుకై చింతింపనేల త్రిగుణాత్మకంబైన నామాయ నె రుంగ నేరికిందరంబుగాదు నన్ను సేవించుచుండువారలు దానినెరుంగుదురు.

శ్లో॥ అభక్తాయెమహాబాహోమయిశ్రద్ధావివర్జితాః। ఫలంకామయమానాస్తే త్వైహికాముష్మికం ఫలం॥ ౩౮॥ క్షయ్యంస్వల్పంనాతిశయంయతః కర్మఫలంమతం। తదవిజ్ఞాయకర్మాణియెకుర్వంతి నరాధమాః॥ ౩౯॥ మాతుఃపతంతిగర్భేపి మృత్యువక్త్రేపునఃపునః । నానాయోనిషుజాతస్య దేహినోయస్యకస్యచిత్॥ ౪౦॥ కోటిజన్మార్జితైః పుణ్యైర్మయిభక్తిఃప్రజాయతే। సఏవలభతేజ్ఞా నం మద్భక్తఃశ్రద్ధయాన్వితః॥ ౪౧॥ నాన్యఃకర్మా ణికుర్వాణో జన్మకోటిశతైరపి। తతస్సర్వంపరిత్య జ్య మద్భక్తింసముపాహర॥ ౪౨॥ సర్వధర్మాన్ప రిత్యజ్య మామేకంశరణంవ్రజ । అహంత్వాసర్వ పాపేభ్యో మోక్షయిష్యామిమాశుచః॥ ౪౩॥

తా॥ నాయందుభక్తిలేక శ్రద్ధనాని ఫలాపేక్షంగోరి స్వల్పంబును క్షీ ణంబును నైన ఐహికసుఖంబులకై కర్మంబు లాచరించువారలు మృత్యుయు క్తంబైన మాతృగర్భంబునంబడుచుండుదు. అనేకయోనులం బుట్టుచున్నవా

రిలో నొకానొకనికి కోటిజన్మార్జితంబులైన పుణ్యంబులచే నాయందు భక్తిగ లుగు. అట్టివానికి శ్రద్ధచే జ్ఞానంబుగలుగు, కర్మంబుల జేయుచున్న నితరు లకు కోటిజన్మంబులకైన ముక్తిలేదు గావున, ఓరామా సర్వంబునువిడిచి మ ద్భక్తింబొంది నన్నే శరణంబునొందుము నేనీపాపంబులబోద్రోలి మోక్షం బిచ్చెద.

శ్లో॥ యత్కరోషియదశ్నాసి యజ్జుహోషిదదాసియ
త్ । యత్తపస్యసిరామత్వం తత్కురుష్వమద
ర్పణం॥ ౪౪॥ తతఃపరతరంనాస్తి భక్తిర్మయిర
ఘూత్తమ॥ ౪౫॥

తా॥ నీవేదిచేసినను, ఏదిభుజించినను, ఏహోమంబాచరించినను, ఏదా నంబుచేసిగను, ఏతపంబుగావించినను, అవియెల్ల నాకర్పణంబుగాఁజేయుము మరియొండులేదు దానినీకు నాయందుభక్తిగలఁగునని శివుండు రామునకుం జెప్పెను.

ఇతి శ్రీపద్మపురాణే.

శ్రీమచ్ఛివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శివరాఘవసంవాదే పంచకోశోపాసనం
నామ చతుర్దశోధ్యాయః.

ఇది పద్మపురాణంబున శ్రీకరంబై యుపనిషద్రూపమైనదియు పరబ్రహ్మ
విద్యయైనట్టి శివగీతలనెడు యోగశాస్త్రంబున శివరాఘవ
సంవాద రూపంబైన పంచకోశోపాసనంబను
పదునాలవ యధ్యాయము ముగిసెను.

# పంచదశోధ్యాయః.

శ్రీరామ ఉవాచ.

శ్లో॥ భక్తిస్తేకీదృశీదేవజాయతేవాకథంవద। యయా సర్వాధిపత్యంతు లభతేమోక్షముత్తమం త ద్బ్రూహిగిరిజాకాంతప్రాప్యతెమెననిర్వృతిం॥౧

శ్రీరాముండు చెప్పుచున్నాడు.

తా॥ ఓదేవా నరునకు నీభక్తియెట్లు గలుగు యేభక్తిగలిగనేని సర్వాధిపత్యంబును మోక్షంబును గలుగునో దానిం జెప్పుమనిన సదాశివుండిట్లనియె.

శ్రీభగవా నువాచ.

శ్లో॥ యోవేదాధ్యయనంయజ్ఞాఁ దానానిచతపాంసిచ। మదర్పణధియాకుర్యాత్సమె భక్తస్సమే ప్రియః॥ ౨॥

తా॥ ఓరామచంద్రా వేదాధ్య యనంబును యజ్ఞంబులు తపంబులు మదర్పణంబుగానే నరుండుజేయునో వాడు నాప్రియభక్తుండు.

శ్లో॥ అవిముక్తేదండకాయాం శ్రీశైలెపుండరీకకే। యఉపాస్తె మమాకారం సమేభక్తస్సమే ప్రియః॥ ౩॥

తా॥ అవి ముక్తక్షేత్రంబున దండకావనంబున శ్రీశైలంబున పుండరీకంబున నేనరుండు నన్నారాధించునో వాడు నాప్రియభక్తుండు.

శ్లో॥ నరోభస్మసమాదాయ విశుద్ధంశ్రోత్రియాలయాత్। అగ్నిరిత్యాదిభిర్మంత్రై రభిమంత్ర్యయధావిధి॥ ౪॥ ఉద్ధూళయతిగాత్రాణి తేనార్చయతిమామపి ॥౫॥ తస్మాత్పరతరోభక్తో మమరామనవిద్యతే। సర్వదాశిరసా కంఠే రుద్రాక్షాన్ ధా

రయేత్తుయః॥ ౬॥ పంచాక్షరీజపరత స్సమేభ
క్తస్సమేప్రియః॥ ౬౫॥

తా॥ నరుండు శ్రోత్రియుని నింటనుండి పరిశుద్ధంబైన భస్మంబు గ్రహించి యథావిధిగా నగ్ని రిత్యాది మంత్రంబుల నభిమంత్రించి శరీరంబెల్ల నలందుకొని దానిచే నన్నుం బూజించువానికన్న నాకతి ప్రియుండెవ్వడుం గాడు యేనరుండైన శిరంబున కంఠంబున రుద్రాక్షల ధరించి పంచాక్షరీ జపంబు నిరంతరంబు జేయుచుండునో వాడె నాప్రియభక్తుండు.

శ్లో॥ భస్మచ్ఛన్నో భస్మశాయీ సర్వదావిజితేంద్రి
యః । యస్తురుద్రంజపేన్నిత్యం చింతయేన్మామ
నన్యధీః॥ ౭౫॥ నతేనైవచదేహేన శివస్సంజాయ
తేస్వయం॥ ౮॥

తా॥ ఏనరుండైన భస్మం బలందుకొని భస్మశాయియై విజితేంద్రియుండై రుద్రజపంబుఁ జేయుచుండునో యతండు సాక్షాచ్ఛివరూపంబునొందు.

శ్లో॥ జపేద్యోరౌద్రసూక్తాని తథాథర్వశిరఃపరం ।
కైవల్యోపనిషత్సూక్తం శ్వేతాశ్వతరమేవచ॥
౯॥ తతఃపరతరోభక్తో మమలోకేనవిద్యతే॥ ౯౫॥

తా॥ ఏనరుండైన రౌద్రసూక్తంబుల ఆధర్వణ మంత్రంబుల కైవల్యోపనిషత్సూక్తంబుల శ్వేతాశ్వతరమంత్రంబుల నిరంతరంబు జపించుచుండునో వానికన్న భక్తుండెవ్వండే లోకంబులను లేదు.

శ్లో॥ అన్యత్రధర్మాదన్యత్ర చాన్యత్రాస్మాత్కృతాకృ
తాత్ । అన్యత్రభూతాద్భవ్యాచ్చ యత్ప్రవ
క్ష్యామితచ్ఛృణు॥౧౦॥ వదంతియత్పదంవేదా
శ్శాస్త్రాణివివిధాన్యపి । సర్వోపనిషదాంసారం
దధ్నోఘృతమివోద్ధృతం॥ ౧౦౫॥

తా॥ సకలధర్మంబులు కృతాకృతంబులు భూతభవ్యంబులు వేదశాస్త్రంబులు సర్వోపనిషత్తులు వీనియందలి సారాంశంబును దధియందలి ఘృతంబురీతి నెరింగించెద.

శ్లో॥ యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతిమునయస్స
దా। తత్తేపదంసంగ్రహేణ బ్రవీమ్యోమిత్యయ
త్పదం॥ ౧౨॥ ఏతదేవాక్షరంబ్రహ్మ ఏతదే
వాక్షరంపదం। ఏతదేవాక్షరంజ్ఞాత్వా యోయ
దిఛతితస్యతత్॥ ౧౩॥ ఏతదాలంబనంశ్రేష్ఠం
ఏతదాలంబనంపరం । ఏతదాలంబనంజ్ఞాత్వా
బ్రహ్మలోకేమహీయతే ॥ ౧౪॥ ఛందసాంయ
స్యధేనూనా మృషభత్వేనచోదితః॥ ౧౫॥

తా॥ మహామునులు బ్రహ్మచర్యంబుచే నెఱుంగుదాని సంగ్రహంబుగా జెప్పెదవినుము ఓంకారంబు అక్షరంబు బ్రహ్మరూపంబు సకలంబున కాలంబనంబు పరంబు శ్రేష్ఠంబైయుండు దానిం దెలియువారలు బ్రహ్మలోకంబు జేరుదు రది ధేనువులలో వృషభంబు భాతి సకలఛందంబులలో శ్రేష్ఠంబై యుండు.

శ్లో॥ ఇంద్రోమేధాంపతింసేతు మమృతస్యచధారణం
౧౬॥ మేధయాపిహితఃకోశం బ్రహ్మణోర్యత్ప
రంమతం। చతస్రస్తస్యమాత్రాఃస్యు రకారోకా
రకౌతథా॥ ౧౭॥ మకారశ్చావసానేర్ధ మా
త్రేతిపరికీర్తితాః । పూర్వాత్రభూశ్చఋగ్వేదో
బ్రహ్మాష్టవసవస్తథా॥ ౧౮॥ గార్హపత్యశ్చగా
యత్రీ గంగాప్రాతస్సవస్తథా । ద్వితీయాచభు
వోవిష్ణు రుద్రాస్త్రిష్టుబ్యజుస్తథా॥ ౧౯॥ యము
నాదక్షిణాగ్నిశ్చ మాధ్యందినసవస్తథా । తృతీ
యాచసువశ్సామమాదిత్యాశ్చమహేశ్వరః ॥
౧౯॥ అగ్నిరాహవనీయశ్చ జగతీచసరస్వతీ॥
౨౦॥ తృతీయంసవనంప్రోక్త మాథర్వత్వేనయన్మ
తం। తురీయాచావసానేర్ధ మాత్రాసాసోమలో

కకః॥ ౨౧॥ అథర్వాంగిరసస్సంవర్తకోగ్నిర్మరుత స్తథా । విరాట్సభ్యావసభ్యాచ చతుర్థీ యజ్ఞపుచ్ఛకః॥ ౨౨॥ ప్రథమారక్తవర్ణాస్యా ద్వితీయా భాస్వరామతా। తృతీయావిద్యుదాభాస్యాచ్చతుర్థీ శుక్లవర్ణికా॥ ౨౩॥ సర్వంజాతంజాయమానం తదోంకారేప్రతిష్ఠితం । విశ్వంభూతంచభువనం విచిత్రంబహుధాతథా॥ ౨౪॥ జాతంచ జాయమానంయత్తత్సర్వంరుద్రఉచ్యతే। తస్మిన్నమవపుఃప్రాణాస్సర్వమోంకారఉచ్యతే॥ ౨౫॥ ప్రవిగీతంతదోంకారే పరంబ్రహ్మసనాతనం। తస్మాదోంకారజాతీయస్సముక్తోనాత్రసంశయః ॥ ౨౬॥

తా॥ ఇంద్రుండు మేధను పతిని సేతువును అమృతధారణంబును బొంది నరీతి మేధాపిహితంబైన కోశంబు బ్రహ్మపదంబుగానగు దానికి నాలుగు మాత్రలు అకారోకారంబులు అవసానంబున మకారంబుండు పూర్వంబున భూశబ్దంబు ఋగ్వేదంబు బ్రహ్మయు అష్టవసువులు గార్హపత్యంబుగా య త్రియుండు రెండవది విష్ణువు రుద్రులు త్రిష్టుప్ యజుర్వేదంబు యమునా దక్షిణాగ్నులు మాధ్యం దినసవంబులు మూడవది సూర్యుండు మహేశుండు అగ్నిరాహవ నియ్యంబులు జగతీసరస్వతులు తృతీయంబు సవనంబని చెప్పంబడు అది మార్జవత్వంనొందు తురీయంబవసానంబున అర్ధమాత్రాయుతంబై సోమలోక ప్రదాయిరై అథర్వాంగిరసులు సంవర్తకాగ్ని మరుత్తులు విరాట్టు సభ్యావసభ్యులు వీరితోగూడి యజ్ఞపుచ్ఛకంబైయుండు మొదటిది రక్తవర్ణంబుగలది రెండవది భాస్వరంబు మూడవది విద్యుద్వర్ణంబుగలది నాలవది శుక్లవర్ణంబుగలదిగానుండు జాతంబును జాయమానంబును ఐనవిశ్వంబెల్ల చిత్రవిచిత్రంబై ఓంకారంబున నణంగియుండు నదియు రుద్రరూపంబుగాన నాశరీరంబును ప్రాణంబులు ఓంకారరూపంబుగానుండు ఓంకారంబే సనాతన బ్రహ్మంబని చెప్పంబడుగాన నోంకారం బెరింగినవాడు ముక్తుండగు సందియంబులేదు,

శ్లో॥ శ్రౌతాగ్నేశ్చార్తవహ్నేర్వా శైవాగ్నేర్వాస



మాహృతం । భస్మాభిమంత్ర్యమోమాంతు ప్ర

ణవేనప్రపూజయేత్॥ ౨౭॥ తస్మాత్పరతరోభక్తో మమలోకేనవిద్యతే । శావాగ్నేర్దావవహ్నే ర్వా భస్మానీయాభిమంత్రితం॥ ౨౮॥ యోవిలిం పతిగాత్రాణిసశూద్రోపివిముచ్యతే।కుశపుష్పై బిల్వదళైః పుష్పైర్వాగిరిసంభవైః॥ ౨౯॥ యోమామర్చయతేనిత్యం ప్రణవేనప్రియోహి సః॥ ౨౯॥ పుష్పంఫలంచమూలం వాపత్రం సలిలమేవవా । యోదద్యాత్ప్రణవైర్మహ్యాం త త్కోటిగుణితంభవేత్॥　　　　౩౦॥

తా॥ ఏనరుండైన శ్రౌతాగ్నివలనను స్మార్తాగ్నివలనను శైవాగ్నివలనను భస్మంబు గ్రహించి అభిమంత్రించి ప్రణవపూర్వకంబుగా నన్ను బూజించువానికన్న ప్రియభక్తుం డెవ్వండునులేడు నరుండు శావాగ్నినుండియు దావాగ్నినుండియు భస్మంబు గ్రహించి శరీరంబున నలందుకొని శూద్రుండైన నన్నుంబూజించెనేని యతండు విముక్తుండగు నరుండు కుశపుష్పంబుల బిల్వదళంబుల గిరిసంభవ కుసుమంబుల నిత్యంబు ప్రణవపూర్వకంబుగా నన్నుం బూజించినవాడు నాకతిప్రియ భక్తుండగు పుష్పంబును ఫలంబును పత్రంబైన సలిలంబైన ప్రణవపూర్వకంబు నాకొసంగిన వానికి కోటిగుణిత ఫలంబబ్బు.

శ్లో॥ అహింసాసత్యమస్తేయం శౌచమింద్రియనిగ్ర హః। యస్యాస్త్యధ్యయనంనిత్యం సమేభక్తస్స మేప్రియః॥　　　　౩౧॥

తా॥ అహింసయు సత్యంబస్తేయంబు శౌచంబు ఇంద్రియ నిగ్రహం బివిగలవాడు నాకతి భక్తుండగు.

శ్లో॥ ప్రదోషేమమస్థానం గత్వాపూజయతేతు మాం। సపరాంశ్రియమాప్నోతి పశ్చాన్మయివి లీయతే॥　　　　౩౨॥

తా॥ యేవరుండైన ప్రదోషకాలంబున నాస్థానంబుజేరి నన్నుం బూజించునో యతఁడు అధికైశ్వర్యంబులనుభవించి పిమ్మట నన్నుంజేరు.

శ్లో॥ అష్టమ్యాంచచతుర్దశ్యాం పర్వణోరుభయోరపి।
భూతిభూషితసర్వాంగో యఃపూజయతిమాం
నిశి॥ 33॥ కృష్ణపక్షేవిశేషేణ సమేభక్తోనసం
శయః॥ 3४॥ ఏకాదశ్యాముపోష్యైవంయః పూ
జయతిమాంనిశి। సోమవారేవిశేషేణ సమేభక్తో
నసంశయః॥ 3౫॥

తా॥ అష్టమియందైన చతుర్దశియందైన ఉభయపర్వంబులయందైన కృష్ణపక్షంబందైనశరీరంబెల్ల భూతి నలందుకొనినన్నుంబూజించువాడు నాకతిప్రియభక్తుండు ఏకాదశియందును సోమవారంబందును నన్నుంబూజించువాడు నాకతిప్రియుండు.

శ్లో॥ పంచామృతైఃస్నాపయేద్యః పంచగవ్యేన వాపునః। పుష్పైర్దీకైశ్శుద్ధజలైస్తస్మాన్నాన్యఃప్రియోమమ॥ 3౬॥ పయసాసర్పిషావాపి మధునేక్షురసేనవా। పక్వామ్రఫలజేనాపినారికేళజలేనవా॥ 3౭॥ గుడోదకేనవాయోమాం రుద్రమంత్రమనుస్మరన్। అభిషించేత్తతోనాన్యఃకశ్చిత్ప్రియతరోమమ॥ 3౮॥

తా॥ పంచామృతంబులనైనను పంచగవ్యంబులనైనను పుష్పంబుల దళంబుల పరిశుద్ధ జలంబుల క్షీరంబున నేతిని మధువుచే ఇక్షురసంబుల మామిడిపండుల నారికేళజలంబుల గుడంబున రుద్రమంత్ర పూర్వకంబుగా నాకభిషేకంబు జేయువాడు నాకతి ప్రియభక్తుండగు.

శ్లో॥ ఆదిత్యాభిముఖోభూత్వా చోర్ధ్వబాహుర్జలేస్థితః। మాంధ్యాయన్రవిబింబస్థ మథర్వశిరసంజపేత్॥ 3౯॥ ప్రవిశేన్మచ్ఛరీరేసౌ గృహంగృహపతిర్యథా॥ 3౯॥

తా॥ నరుండు సూర్యునికెదురైనిలచి ఊర్ధ్వబాహుడై జలంబులనుండి సూర్యమండల మధ్యస్థితుండనగు నన్నుధర్వ శిరోమంత్రంబుల జపించువాడు గృహపతి తన గృహంబుఁ జేరురీతి నన్నుంజేరు.

శ్లో॥ బృహద్రథంతరంవాను దేవ్యం దేవవ్రతానిచ ॥
౨౦॥ తద్భోగాయాజ్యదోహాంశ్చ యోగాయతి
మమాగ్రతః। ఇహశ్రియంపరాంభుక్త్వ మమసా
యుజ్యమాప్నుయాత్ ॥ ౨౧ ॥ ఈశావాస్యాది
మంత్రాన్యోజపేన్నిత్యంమమాగ్రతః। మత్సా
యుజ్యమవాప్నోతి మమలోకేమహీయతే॥౨౨॥

తా॥ యేనరుండైన దేవవ్రతంబు లాచరించుచు బృహద్రథంతరాది నామంబుల జపించుచు నాయెదుర మధురగానంబాచరించువాడు ఈలోకంబున సమస్తసుఖంబు లనుభవించి పిమ్మట నా సాయుజ్యంబుపొందు ఏ నరుండైన నిత్యంబును యీశావాస్యాది మంత్రంబుల నాయెదుర జపించువాడు మదీయలోకంబున నాసాయుజ్యంబు నొందు.

శ్లో॥ భక్తియోగోమయాప్రోక్త ఏవంరఘుకులోద్భ
వ।సర్వకామప్రదాన్మత్తః కిమన్యచ్ఛ్రోతుమిచ్ఛసి॥౨౩॥

తా॥ ఓరామచంద్రా భక్తియోగం బెఱింగించితింక సర్వకామ ప్రదుండనగు నావలన నేది వినంగోరెదవని శ్రీరామునితో శివుం వక్కాణించెను.

ఇతి శ్రీపద్మపురాణే.

శ్రీమచ్ఛివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శివరాఘవసంవాదే—భక్తియోగో
నామ పంచదశోఽధ్యాయః.

ఇది స్కాంద పురాణంబున శ్రీకరంబైన యుపనిషద్రూపమైనదియు
పరబ్రహ్మ విద్యయైనట్టి శివగీతలనెడు యోగశాస్త్రంబున
శివరాఘవ సంవాదరూపంబైన భక్తియోగంబను
పదియైదవ యధ్యాయము ముగిసెను.

## షోడశోధ్యాయః.

శ్రీరామ ఉవాచ.

శ్లో॥ భగవన్మోక్షమార్గోయం త్వయాసమ్యగుదీరితః।
తత్రాధికారిణం బ్రూహి తత్ర మేసంశయోమహాన్॥ ౧॥

శ్రీరాముండు చెప్పుచున్నాడు.

తా॥ ఓ దేవదేవా మోక్షమార్గం బెఱిగించితివి దాని కధికారి యెట్టివాఁడు వాని నెఱుంగించి నాసంశయంబు వాపుము.

శ్రీభగవానువాచ.

శ్లో॥ బ్రహ్మక్షత్రవిశశ్శూద్రా స్త్రియశ్చాత్రాధికారిణః। బ్రహ్మచారీగృహస్థోవానుపనీతోథవాద్విజః॥ ౨॥ వనస్థోవావనస్థోవా యతిఃపాశుపతవ్రతీ। బహునాత్రకిముక్తేన యస్యభక్తిశ్శివార్చనే ౩॥ సఏవాస్యాధికారీస్యా న్నాన్యచిత్తఃకథంచన। జడోంధోబధిరోమూకో నిశ్శౌచఃకర్మవర్జితః॥ ౪॥ అజ్ఞోపహాస్యోభక్తశ్చ భూతిరుద్రాక్షధారణః। యోమాంగురుంపాశుపతం వ్రతంద్వేష్టినసాధమః॥ ౫॥ విష్ణుంవానసముచ్యేత జన్మకోటిశతైరపి। అనేకకర్మాసక్తోపి శివజ్ఞానవివర్జితః॥ ౬॥ శివభక్తివిహీనశ్చ సంసారాన్నైవముచ్యతే। ఆసక్తఫలరాగేణ యత్త్వవైదికకర్మణి॥ ౭॥ దృష్టిమాత్రఫలాస్తేతు నముక్తావధికారిణః। అవిముక్తేదండకాయాం శ్రీశైలేపుండరీకకే॥ ౮॥ దే

స్యహస్తాచపాదాచ మనశ్చైవసుసంయుతః।
విద్యాతపశ్చకీర్తిశ్చ సతీర్థఫలమశ్నుతే॥ ౯౫॥
విప్రస్యానుపనీతస్య విధిరేవముదాహృతః। నాభి
వ్యాహరయేర్బ్రహ్మసదోసనయనాదృతే॥ ౧౦౫॥
సశూద్రేణసమస్తావ వ్యావద్వేదోనధీయతే।

అనిన శంభుండు జెప్పుచున్నాడు.

తా॥ ఓరామా బ్రాహ్మణుండైన రాజైన వైశ్యుండైన శూద్రుండైనను బ్రహ్మచారియైనను గృహస్థుండైనను అనుపనీతుండైనను వానప్రస్థుండైనను యతియైనను వీరెవ్వరైనను పాశుపత వ్రతంబు జేయం దగుదురు వేయి మాటలేల ఏనరునికి శివార్చనయందు భక్తిగలదో వాడే యధికారియగు అన్యుండుగానేరడు జడుండైన అంధుండైన బధిరుండైన మూకుండైన అశుచియైన కర్మవర్జితుండైన అజ్ఞుండైన పరిహాసకుండైనను భూతి రుద్రాక్ష ధారణుండునా భక్తుండగు యేనరుండైనను గురువను నన్నును పాశుపత వ్రతంబును విష్ణు దేవుని విరోధించువాడు కోటి జన్మంబులకైన ముక్తి నొందనేరడు నరుండు శివజ్ఞానంబులేక యెన్నికర్మంబు లాచరించియు సంసార విముక్తుండుగానేరడు ఫలాపేక్షచే కర్మంబు లాచరించువారలు ముక్తిబొందజాలరు అవి ముక్తంబున దండకావనంబున శ్రీశైల పుండరీకంబుల దేహాంత కాలంబున నాయుసు గ్రహంబుచే తారకబ్రహ్మంబు నొందుదురు యేనరునికైన పాదంబులు కరంబులు మనంబు విద్యయు తపంబు సంయతంబులగునో అతండు తీర్థఫలంబందు విప్రుండు ఉపనయనంబులేక బ్రహ్మోపాసనంబు జేయరాదు వేదాధ్యయనంబు లేనివాడు శూద్రసమానుండు.

శ్లో॥ నామసంకీర్తనేధ్యానేసర్వఏవాధికారిణః॥ ౧౧౫॥

తా॥ నామసంకీర్తనంబు జేయువారెల్ల వారికి నధికారంబుగలదు.

శ్లో॥ సంసారాన్ముచ్యతేజంతు శ్శివతాదాత్మ్యభావనాత్। యజ్ఞోదానంతపోవేదాధ్యయనంనాన్యకర్మవా॥ ౧౨౫॥ సహస్రాంశంతునార్హంతి సర్వదా
ధ్యానకర్మణః। మాతిమాత్రము...

లమథాపివా॥ ౧౩॥ ఆసనాదీనికర్మాణి ధ్యానం
నాపేక్షతేక్వచిత్ ॥ ౧౪॥ గచ్ఛంస్తిష్ఠంశ్చరన్వాపి
శయానోవాన్యకర్మణి । లౌకికేత్యంతయుక్తోపి
ధ్యానాదేవవిముచ్యతే॥ ౧౫॥

తా॥ జనుండు శివధ్యానంబున సంసారముక్తుండగు యజ్ఞంబులు దానంబులు అధ్యయనంబు లితర కర్మంబులెల్ల శివధ్యాన సహస్రాంశంబున కైన నీడుగావు జాతియు నాశ్రమంబులు చిహ్నంబులు దేశకాలంబులు ఆసనాదికర్మంబులు ఇవియెల్ల ధ్యానంబునకు లేదు నరుండు నడుచుచుండియు నిలుచుండియు పరుండియు లౌకిక కార్యాసక్తుండైయున్నను శివధ్యానంబు గలిగిన ముక్తుండగు.

శ్లో॥ దేహాదిశ్రమలేశోస్తి ప్రత్యవాయోనవిద్యతే ।
స్వల్పమప్యస్యధర్మస్య త్రాయతేమహతోభయాత్ ॥ ౧౬॥

తా॥ ధ్యానంబునకు శరీరబాధయు ప్రత్యవాయంబును అల్పానల్పంబులు లేవు మహాభయంబుల నణంచు.

శ్లో॥ ఆశ్చర్యేవాభయేశోకేక్షుతేవామమనామయః।
వ్యాజేనైవస్మరేద్యస్తు సయాతిపరమాంగతిం॥ ౧౭॥

తా॥ ఆశ్చర్యంబుననైన భయంబుననైన దుఃఖంబుననైన తుమ్ముటంబుననైన శివనామస్మరణంబు జేయువాడు ముక్తుండగు.

శ్లో॥ మహాపాపైరపిస్పృష్టో దేహాంతేయస్తుమాంస్మరేత్ । పంచాక్షరీంచోచ్చరతి సముక్తోనాత్రసంశయః॥ ౧౮॥ విశ్వంశివమయంయస్తుపశ్యత్యాత్మానమాత్మని। తస్యక్షేత్రేషుతీర్థేషు కింకార్యంచాన్యకర్మణి॥ ౧౯॥ సర్వేణసర్వదాకార్యం భూతిరుద్రాక్షధారణం। యుక్తేనవాప్యయుక్తేన శివభక్తిమభీప్సతా॥ ౨౦॥

తా॥ మహాపాపియైన దేహాంతంబున నన్నుందలంచి పంచాక్షరీ మంత్రంబు స్మరించెనేని ముక్తినొందు సందియంబులేదు యేనరుండైనను జగంబెల్ల శివమయంబని యెంచునో వానికి సకలపుణ్య తీర్థంబుల క్షేత్రంబుల యజ్ఞాదికర్మంబుల కార్యంబులేదు శివభక్తిగోరు సకలజనంబులును నిరంతరంబును భూతి రుద్రాక్షల ధరింపవలయు.

శ్లో॥ నరోభస్మసమాయుక్తో రుద్రాక్షాన్యస్తుధారయేత్ । మహాపాపైరపిస్పృష్టో ముచ్యతేనాత్ర సంశయః॥ ౨౧॥

తా॥ నరుండు శరీరంబున భస్మంబలందికొని రుద్రాక్షల ధరించుచుండునో వాడెట్టి పాపియైనను ముక్తుండగు.

శ్లో॥ అన్యానిశైవకర్మాణి కరోతునకరోతువా । శివనామజపేద్యస్తు సర్వదాముచ్యతేతునః॥ ౨౨॥

తా॥ నరుండు శివకర్మంబు లేవిజేసినం జేయకున్నను శివనామ స్మరణంబు గావించెనేని ముక్తుండగు.

శ్లో॥ అంత్యకాలేతురుద్రాక్షాన్విభూతింధారయేత్తుయః। మహాపాపోపపాపౌఘై రపిస్పృష్టోనరాధమః॥ ౨౩॥ సర్వదానోపసర్పంతి తంజనంయమకింకరాః॥ ౨౩౻॥

తా॥ మహాపాపాత్ముండైనను అంత్యకాలంబున భూతి రుద్రాక్షల ధరించెనేని యమదూతలు వానింజేరరు.

శ్లో॥ బిల్వమూలమృదాయస్తు శరీరముపలింపతి। అంత్యకాలెంతకజనై స్సదూరీక్రియతేనరః॥ ౨౪౻॥

తా॥ ఏనరుండైన అంత్యకాలంబున బిల్వమూలంబందున్న మృత్తును శరీరంబుపై నలందుకొన్నవానిని యమకింకరులు చేరరు అని శివుండు శ్రీరామునకుం జెప్పెను.

ఇతి శ్రీపద్మపురాణే.

శ్రీమచ్ఛివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ
శాస్త్రే శివరాఘవసంవాదే మోక్షాధికార ని
రూపణయోగోనామ షోడశోధ్యాయః.

ఇది పద్మపురాణంబున శ్రీకరంబై యుపనిషద్రూపమైనదియు పరబ్రహ్మ
విద్యయైనట్టి శివగీతలనెడు యోగశాస్త్రంబున శివరాఘవ
సంవాదరూపంబైన మోక్షాధికార నిరూపణయోగం
బనుపదియారవ అధ్యాయము ముగిసెను.

## సప్తదశోధ్యాయః.

శ్రీరామ ఉవాచ.

శ్లో॥ భగవన్పూజితః కుత్రకుత్ర వాత్వంప్రసీదసి । త
న్మేబ్రూహిమమజిజ్ఞాసా వర్తతే మహతీవిభో॥ ౧॥

శ్రీరాముండు చెప్పుచున్నాడు.

తా॥ ఓదేవా నీవెచటపూజింపంబడి ప్రసన్నుండవగుదువు దానిం జెప్పుమనిన.

శ్రీ భగవానువాచ.

శ్లో॥ మృదావాగోమయెనాపిభస్మనాచందనేనవా। సి
కతాభిర్వారిణావాపాషాణై ర్వాథనిర్మితా॥ ౨॥
లోహేనవాథరత్నేనకాంస్యకర్పరపిత్తళైః।తా
మ్రరౌప్యసు వర్ణై ర్వారత్నైర్నానావిధై రపి॥
౩॥అథవాపారదేనైవకపూర్ణారేణాథనాకృతా।
ప్రతిమాంశివలింగంవా ద్రవ్యైరేతైః కృతంతు
యత్ ॥౪॥తత్రమాంపూజయెత్తేషుఫలంకోటిగు
ణోత్తరం॥౫॥మృద్దారుకాంస్యలోహైశ్చపాషా
ణై ర్వాపినిర్మితా। గృహేనప్రతిమాకార్యాశివం
శశ్వదభీప్సతా॥౬॥ ఆయుఃకులంశ్రియోధర్మం
పుత్రాన్ప్రాప్స్యంతితైఃక్రమాత్ । బిల్వవృక్షే
తత్ఫలెవాయోమాంపూజయతేనరః॥౭॥పరాం
శ్రియమిహప్రాప్యమమలోకెమహీయతే॥౮॥ బి
ల్వవృక్షం సమాశ్రిత్య యోమంత్రాన్వివిధాన్
జపేత్ । ఎకేనదివసేనైవ తత్పురశ్చరణంభవే
త్॥ ౯॥ యస్తుబిల్వవనెనిత్యంకుటింకృత్వావసె

న్నరః। సర్వేమంత్రాః ప్రసిధ్యంతి జపమాత్రేణ కేవలం॥ ౯॥

శివుం డిట్లనియె.

తా॥ ఓరామచంద్రా మృత్తుచేనైనను గోమయంబుచేనైనను భస్మంబుననైన చందనంబుననైనను పాషాణంబుననైన యిసుకనైన లోహరత్నంబులనైన కాంస్యకర్పరపిత్తళంబులనైన తామ్రరౌప్య సువర్ణంబులనైన నానావిధ రత్నంబులనైన కర్పూరంబుచేనైన ప్రతిమంగాని లింగంబునుంగాని రచియించి నన్నుం బూజించిన కోటిగుణంబులు గలుగు శుభంబుగోరువారు మృత్కాంస్యలోహ పాషాణాదుల ప్రతిమం గావించి పూజించిరేని ఆయుః ఫలంబుల ధర్మసంపదల పుత్రులం బొంది సుఖింతురు బిల్వదళంబుల తత్ఫలంబుల ననుం బూజించువాడు ఇహంబున మహదైశ్వర్యంబులనొంది అంతంబున మదీయలోకంబుజేరు యేనరుండైనను బిల్వవృక్షంబుజేరి యొకదినంబైన నానావిధమంత్రంబుల జపించిన నతండు సిద్ధినొందు. ఏనరుండైన బిల్వవనంబునకుటిం గావించుకొని మంత్రంబుల జపించినమాత్రంబుననే సిద్ధుండగు.

శ్లో॥ పర్వతాగ్రేనదీతీరేబిల్వమూలేశివాలయే। అగ్నిహోత్రే కేశవస్యసన్నిధౌతుజపేత్తుయః॥ ౧౦॥ నైవాస్య విఘ్నంకుర్వంతిదానవా యక్షరాక్షసాః। తంనస్పృశంతిపాపాని శివసాయుజ్య మృచ్ఛతి॥

తా॥ యేనరుండైన పర్వతాగ్రంబుననైన నదీతీరంబుండైనను బిల్వమూలంబుండైనను శివాలయంబుండైనను అగ్నిహోత్ర గృహంబుండైనను విష్ణుసన్నిధినైనను జపించుచుండు వానికి దానవయక్షరాక్షసులే విఘ్నంబుల జేయంజాలరు యేపాపంబులు వానినంటవు అతండు శివసాయుజ్యంబునొందు.

శ్లో॥ స్థండిలేవాజలేవహ్నౌ వాయావాకాశఏవవా। గిరౌస్వాత్మ నివాయోమాం పూజయేత్ప్రయతోనరః॥ ౧౨॥ అనంతఫలమాప్నోతి దళమాత్రేణరాఘవ। ఆత్మపూజా సమానాస్తి పూజా రఘుకులోద్భవ॥ ౧౩॥ మత్సాయుజ్యమవాప్నోతిచండాలోప్యాత్మపూజయా।

తా॥ స్థండిలంబునన్నైన జలంబందైన నగ్నినైన వాయువందైన నాకాశంబునన్నైన పర్వతంబందైన గాలియుందైన తనయందైన నన్నుంబూజించు అతండనంత ఫలంబునందు ఆత్మపూజాసమం బేదియులేదు దానచండాలుండైన మత్సాయుజ్యంబందు.

శ్లో॥ సర్వాన్కామానవాప్నోతివసంశ్చ కమలాసనే॥
౧౪॥ కృష్ణాజినేభవేన్ముక్తిర్మోక్షశ్శ్రీర్వ్యాఘ్రచర్మణి కుశాసనేభవేద్జ్ఞానమారోగ్యంపత్రనిర్మితే॥౧౫॥

తా॥ నరుండు కమలాసనంబున గూర్చున్న సకల కామంబులనందు కృష్ణాజినంబున ముక్తియు వ్యాఘ్రచర్మంబున మోక్షంబును కుశాసనంబున జ్ఞానంబును పత్రనిర్మితాసనంబున నారోగ్యంబునందు.

శ్లో॥ ప్రాఙ్ముఖోదఙ్ముఖోవాపిజపంపూజాంసమాచరేత్।
పాషాణే దుఃఖమాప్నోతికాష్ఠే నానావిధాన్గదాన్॥ ౧౬॥ వస్త్రేశ్రియమవాప్నోతి భూమౌమంత్రోనసిధ్యతి॥

తా॥ నరుండు ప్రాఙ్ముఖుండైనను ఉదఙ్ముఖుండుగా నైననుం గూర్చుండి జపపూజలం గావింపవలయు పాషాణంబుపై గూర్చున్న దుఃఖంబును కాష్ఠంబుమీద రోగంబులను వస్త్రంబుమీద సంపదనుంబొందు భూమిమీదం గూర్చున్న మంత్రంబు సిద్ధింపదని శివుండు శ్రీరామున కెరుగించెను.

ఇతి శ్రీపద్మపురాణే.

శ్రీమచ్ఛివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శివరాఘవసంవాదే పూజానిరూపణం నామ సప్తదశోధ్యాయః.

ఇది పద్మ పురాణంబున శ్రీకరంబైన యుపనిషద్రూపమైనదియు పరబ్రహ్మ విద్యయైనట్టి శివగీతలనెడు యోగశాస్త్రంబున శివరాఘవ సంవాదరూపంబైన పూజానిరూపణంబను పదునేడవ యధ్యాయము ముగిసెను.

# అ ష్టా ద శో ధ్యా యః.

శ్రీ భగవానువాచ.

శ్లో॥ అక్షమాలావిధింవక్ష్యే శ్రుణుష్వావహితోనృప।
సామ్రాజ్యం స్ఫాటికీదద్యాత్పుత్రజీవ పరాంశ్రి
యం॥ ౧॥ ఆత్మజ్ఞానంకుశగ్రంధీరుద్రాక్షస్సర్వకా
మదః। ప్రవాళైశ్చ కృతామాలా సర్వలోకవశ
ప్రదా॥ ౨॥ ముక్తాఫలైఃకృతామాలా సర్వవి
ద్యాప్రదాయినీ । మాణిక్య రచితామాలాత్రై
లోక్యస్త్రీవశంకరీ॥ ౩॥ నీలైర్మరకతైర్వాపికృతా
శత్రుజయప్రదా । మోక్షప్రదాక్ష మాలాస్యా
దామలక్యాఃఫలైఃకృతా ॥ ౪ ॥ సువర్ణరచితా
మాలా దద్యాద్దైవమహతీంశ్రియం । తథారా
ప్యమయీమాలాకన్యాంయచ్ఛతికాంక్షితాం॥౫॥

శివుండు చెప్పుచున్నాడు.

తా॥ ఓరామచంద్రా అక్షమాలావిధి నెరింగించెద పరాకులేక వినుము స్ఫాటికమాల సాంమ్రాజ్యంబునుపుత్రసంపదయు నిచ్చునుకుశగ్రంధి బ్రహ్మజ్ఞానంబొసంగు రుద్రాక్షమాల సర్వకామంబులిచ్చు ప్రవాళమాలిక లోకవశంకరియగు ముక్తామాలవిద్యా ప్రదాయినియగు మాణిక్యమాల త్రిలోకంబులనందు స్త్రీలస్వాధీనంబుగాఁజేయు ఇంద్రనీల మరకతమణుల జేయంబడినమాలశత్రు జయంబుజేయు అక్షమాలమోక్షంబిచ్చు ఆమలకఫలంబుల సువర్ణంబున జేయంబడిన మాలమహదైశ్వర్యంబు గల్గంజేయు వెండిచే జేయంబడిన మాలకోరినకన్యనిచ్చు.

శ్లో॥ ఉక్తానాంసర్వకామానాం దాయినీపారదైఃకృతా। అష్టోత్తరశతామాలా తత్రస్యాదుత్తమోత్తమా॥ ౬॥ శతసంఖ్యోత్తమామాలా పంచాశన్మధ్యమామతా । చతుఃపంచాశతాయద్వా అధమాసప్తవింశతిః॥ ౭॥ అధమాపంచవింశత్యా యదిస్యాచ్ఛతనిర్మితా।పంచాదశాక్షరాణ్యత్రను లోమప్రతిలోమతః॥ ౮॥ విన్యస్యస్నాపయేద్గూఢానకస్మైచిత్ప్రదర్శయేత్ । వర్ణవిన్యాసయాయస్తు క్రియతేమాల యాజపః॥ ౯॥ ఏకవారేణ తస్యైవపురశ్చర్యా మనోర్భవేత్ । సవ్యంపాష్ణింగుదేస్థాప్యదక్షిణాంఘ్రింద్వయోరపి॥౧౦॥ యోనిముద్రాబంధఏవం భవేదాసనముత్తమం। యోనిముద్రాసనేస్థిత్వాప్రజపేద్యస్సమాహితః॥ ౧౧॥ యంకంచిదపివామంత్రం తస్యస్యుస్సర్వసిద్ధయః । ఛిన్నారుద్ధాస్తుభీతాశ్చ మిాలితామూర్ఛితాస్తథా॥ ౧౨॥ సుప్తామత్తాహీనవిద్యాదగ్ధాగ్రస్తావిపక్షకాః।

తా॥ పారదకృతమాల సర్వకామంబులిచ్చు అష్టోత్తరశతసంఖ్య గలదందు శ్రేష్ఠంబు శతసంఖ్యగలదియు నుత్తమంబు పంచాశత్సంఖ్య గలదియుం చతుఃపంచాశత్సంఖ్యగలదియును మధ్యమంబు పంచవింశతిసంఖ్యగలదియు సప్తవింశతి వింశతిగలదియు అధమంబు అమాలయందు అనులోమప్రతిలోమంబుగా యేబదక్షరంబుల గూఢంబుగావ్రాసి యొకరికిం జూపకనుండవలయు యేనరుండైై వర్ణవిన్యాసమాలచే జపంబుచేయునో యతండొకవారంబున సిద్ధినొందు సవ్యపాష్ణకరంబుల గుదంబుననుంచి దక్షిణాంఘ్రిని రెంట

సంచిన యోనిముద్రా బంధనంబను నాసనంబు దానియందుండినియతుండై యేమంత్రంబైనను జపించినవానికిసర్వసిద్ధులుగలుగు వానిశత్రువులెల్ల భిన్నాభిన్నులు భీతులుబద్ధులు మూర్ఛితులు హీనవిద్యులు సుప్తులు దగ్ధులునగుదురు.

శ్లో॥ బాలయౌవ్వన మంత్రాశ్చ వృద్ధామంత్రాశ్చ
యేజపాః॥ ౧౩॥ యోనిముద్రాసనేస్థిత్వా మం
త్రా నేవంవిధాఞ్జపేత్ । తస్యసిధ్యంతి తేమం
త్రా నాన్యస్యతుకథంచన॥ ౧౪॥ బ్రాహ్మే ము
హూర్తమారభ్య మధ్యాహ్నే ప్రజపేన్మనుం ।
అతఊర్ధ్వంకృతేజాపేవినాశోభవతిధృవం॥ ౧౫॥

తా॥ యోని ముద్రాసనంబున నుండి నరుండు బాల యౌవ్వన వృద్ధ మంత్రంబుల జపించెనేని వానికిసిద్ధిగలుగు మరియొక మార్గంబునంగాదు ద్విజుండు బ్రాహ్మ్యముహూర్తంబున నారంభించి మధ్యాహ్నకాలంబువరకు జపింపవలయు అట్లుగాకున్న వినాశంబుగల్గు.

శ్లో॥ పురశ్చర్యావిధానేనసర్వకామ్యఫలేష్వపి । నిత్య
నైమిత్తికేవాపితపశ్చర్యాతథాపునః॥ ౧౬॥ సర్వ
థైవజపఃకార్యోనదోష స్తత్రకశ్చనయస్తు రుద్రం
జపేన్నిత్యం ధ్యాయమానో మమాకృతిం॥ ౧౭॥
షడక్షరంవా ప్రణవం నిష్కామో విజితేంద్రి
యః। అధీతే శివగీతాంయో నిత్యమేతాంప్రస
న్నధీః॥ ౧౮ ॥ శృణుయాద్వాసముక్తఃస్యాత్సం
సారాన్నాత్రసంశయః॥ ౧౯॥

తా॥ పురశ్చర్యాక్రమంబున సర్వకామఫలంబుల నిత్యనైమిత్తికాదుల జేయవలయు ఎల్లప్పుడుజపంబు జేయందగు దానదోషంబేమియులేదు ఏనరుండైన నిత్యంబును నాయాకృతిందలంచుచు రుద్రజపంబును షడక్షరంబైన ప్రణవంబైన జపించెనేని నిష్కాముండు విజితేంద్రియుండునగు ఏనరుండైన నిత్యంబును ప్రసన్నమానసుండై యీ శివగీతను పఠించినను విన్నను అతండు సంసారబంధముక్తుండగు నిందుకు సందియంబులేదు.

సూ త ఉ వా చ.

శ్లో॥ ఏవముక్త్వామహాదేవ స్తత్రైవాంతరధీయత। రామఃకృతార్థమాత్మాన మమన్యత తథైవసః ॥ ౧౯॥ఏవంమయాసమాసేనశివగీతాసమీరితా। ఏతాంయః ప్రజపేన్నిత్యంశ్రుణుయాద్వాసమాహితః॥ ౨౦॥ ఏకాగ్రచిత్తోయోమర్త్యస్తస్యముక్తిః కరస్థితా। తతఃశృణుధ్వం మునయోనిత్యమేతాంసమాహితాః॥ ౨౧॥ అనాయాసేనవాముక్తిర్భవిత్రీనాత్రసంశయః॥ ౨౨॥కాయక్లేశోమనఃక్షోభో। ధనహానిర్నచాత్మనః। హతాస్తే శ్రవణాదేవయస్మాత్కైవల్య మాప్నుయాత్ ॥౨౩॥శివగీతామతోనిత్యంశ్రుణుధ్వంమునిసత్తమాః॥౨౪॥

సూతుండు చెప్పుచున్నాడు.

తా॥ ఓమునీంద్రులారా మహాదేవుండిట్లు శ్రీరామచంద్రునకుం జెప్పి యంతర్ధానంబునొందె నంత శ్రీరాముండు తన్నుంగృతార్థుంగా నెంచుచు సుఖంబుననుండె నీ శివగీతలను సంక్షేపంబుగామీకుంజెప్పితి దీనినేకాగ్రచిత్తుండై పఠించువాడును వినువాడును ముక్తినొందు కావున మీరెల్ల నిత్యంబును దీని వినుచుండుడు మీకనాయాసంబున ముక్తిగలుగు నిందుకు సందియంబు లేదు దీని విన్నవారికి కాయక్లేశంబు మనఃక్షోభంబు ధనహానియుగలుగదు కైవల్యంబు గలుగుంగాన దీని వినుచుండుడు.

ఋషయ ఊచుః.

శ్లో॥ అద్యప్రభృతినస్సూత త్వమాచార్యఃపితాగురుః । అవిద్యాయాః పరంపారం యస్మాత్తారయితాసినః ॥ ౨౫॥ ఉత్పాదక బ్రహ్మదాత్రోర్గరీయాన్ బ్రహ్మదఃపితాతస్మాత్సూతాత్మ ~~జత్వ~~ త్తస్సత్యంనాన్యోస్తినోగురుః ॥౨౬॥ ఇత్యుక్త్వాప్రయయు స్సర్వేసాయంసంధ్యాముపాసితుంస్తువంతస్సూతపుత్రంతేసంతుష్టా గోమతీతటం॥ ౨౭॥

అనిన శౌనకాదు లిట్లనిరి.

తా॥ ఓసూతా ఇకమీద మాకెల్ల అవిద్యాసంహర్తవైనగురువీవ పుట్టించిన తండ్రియును బ్రహ్మప్రదాతయును వీరిలో బ్రహ్మప్రదాత యెక్కుడు గాన సత్యంబుగా మాకు నీవగురువు అని వారెల్లవచించి యాసూతుంగొనియాడి సంతుష్టులగుచు సంధ్యావందనంబుఁజేయ గోమతీతటంబునకుంబోయిరి.

ఇతి శ్రీపద్మపురాణే,

శ్రీమచ్ఛివగీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ శాస్త్రే శివరాఘవ సంవాదే జపలక్షణం

నామాష్టాదశోధ్యాయః॥

శివగీతా సమాప్తా.

శ్రీసాంబశివార్పణమస్తు.

ఇది పద్మపురాణంబున శ్రీకరంబై యుపనిషద్రూపమైనదియు పరబ్రహ్మ విద్యమైనట్టి శివగీతలనెడు యోగశాస్త్రంబున శివరాఘవ సంవాద రూపంబైన జపలక్షణంబను పదునెనిమిదవ యధ్యాయము ముగిసెను.

శివగీత సంపూర్ణము.

FINIS.

